# లలిత భావ గీతాలు


రచన

**ఆచార్య వెల్లంకి ఉమాకాంత శాస్త్రి**

*Professor (Retd. from I.I.T., Kharagpur.)*

19-88/36, Prashant Nagar

ECIL Post, Hyderabad - 500 062,

Ph. No. (040) 7125893.





This Book is published with the Financial Assistance of
Sri Potti sreeramulu Telugu University Under the Scheme

***"Financial Assistance for Publication of Books"***

**LALITA BHAVA GEETALU**

*By Dr. Vellanki. Umakanta Sastry*


ప్రతులు : 1000





వెల : రు. 25/- U.S.A. 5 dollars

ముఖచిత్రం :

N. Karunakar, B.Sc., B.F.A., P.G.D.
Artist, Visual Lines
6-3-668/15/4, Panjagutta
Opposite to Kanti Sikara Apts.
Hyderabad - 500 082
Ph : Office : 3325704, Res : 375683

ప్రతులకు :

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞాన భవన్, బాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001.
మరియు విశాలాంధ్ర బుక్‌హౌస్ హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్టణం, గుంటూరు, తిరుపతి, హనుమకొండ, అనంతపురం, కాకినాడ.

ముద్రణ :

**Kalajyothi Process Limited,**
1-1-60/5, Iftekar Mansion Lane,
R.T.C. X Roads, Musheerabad,
Hyderabad - 500 020, A.P.
Ph : 91-40-7645536.

# తొలి పలుకులు

భావ కవిత అనే పదబంధం ఏ సుదినాన పుట్టిందో! ఏ మహనీయుని ఊహనుండీ జనించిందో! ఈ విషయాలను ఇదమిద్ధంగా చెప్పటం అసాధ్యం.

భావ కవిత్వం అంటే మేలురకం కవిత్వమని కొందరూ, సొగసైన భావాలతో కూడుకున్న కవిత్వం అని కొందరూ, హృదయాన్ని స్పందింప చేసే కవిత్వం అని కొందరూ, శబ్దధ్వని, భావధ్వని, రసధ్వని మూడు రకాల ధ్వనులూ ప్రధానమైన కవిత్వమని కొందరూ, కవి తన హృదయంతో పరిపూర్ణమయిన అనుభూతిని పొందుతూ పదాలతో గీచే భావచిత్రాలే భావ కవిత్వమని కొందరు – ఇలా తలా ఒక రంగా మనస్సుకు తోచినట్లుగా, హృదయానికి నచ్చినట్లుగా వస్తు నిర్దేశం చేస్తూ నిర్వచించారు. ఉదాహరణలను చూపించారు. ఈ ఉదాహరణలలో వాల్మీకి అనుష్టుప్పులు, వ్యాసుని అనుష్టుప్పులు, కాళిదాసు వృత్తాలు, కవిత్రయం పద్యాలు, శ్రీనాథుని పద్యాలు, పోతన పద్యాలు, అష్ట దిగ్గజాల పద్యాలు, రాయల వారి పద్యాలు, చేమకూర వెంకట కవి పద్యాలు, మరెందరి పద్యాలో చోటు చేసుకున్నాయి. ఇవే కాక జయదేవుని అష్ట పదులను, అన్నమయ్య పదాలలో కొన్నింటిని, త్యాగరాజకృతులలో కొన్నింటిని, క్షేత్రయ్య పదాలలో కొన్నింటిని భావ కవిత్వానికి ఉదాహరణలుగా వెంటనే ఎత్తి చూపించ వచ్చు. ఎందరో మహాను భావులు!

ఈ శతాబ్దంలోని కవులలో భావకవిత వ్రాసిన వారు ఇంకనూ ఎందరో ఉన్నారు. వారిలో కొందరు: తిరుపతి వెంకట కవులు, పింగళివారు, కాటూరివారు, విశ్వనాథసత్య నారాయణ, జంధ్యాల పాపయ్య శాస్త్రి, జాషువా, తుమ్మల సీతారామమూర్తి చౌదరి, గురజాడ అప్పారావు, నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావు, సముద్రాల రాఘవాచారి, మల్లాది రామకృష్ణ శాస్త్రి, దేవుల పల్లి కృష్ణశాస్త్రి, ఆరుద్ర, శ్రీశ్రీ, దాశరథి మున్నగు వారు. ఈ పట్టీ ఇలాగే వ్రాసుకుంటూ పోతే ఇంకా ఎందరో మహనీయులు!

ఈ నాటి భావ కవితా రంగంలో సుప్రసిద్ధులు: నారాయణరెడ్డి, వేటూరి సుందర రామమూర్తి, సిరివెన్నెల సీతారామశాస్త్రి. ఇంకనూ ప్రముఖులు ఎందరో ఉన్నారు.

''ముఖే ముఖే సరస్వతీ'' అనే ఆర్య వాక్యం అయదార్థం కానేకాదు. అది ఎల్ల వేళలా సత్యమే. వేదాలూ, శాస్త్రాలూ, కళలూ అన్నీ ఆ తల్లి సరస్వతీ దేవి స్వరూపాలే! అన్నీ దైవదత్తమైన వరాలే! అన్నీ లోకంలో అన్నాన్ని సంపాదించుకొనటానికీ, శాంతితో

జీవించటానికీ, శాంతిని నెలకొల్పటానికీ, ఆనందాన్ని సమకూర్చుకొనటానికీ, మనిషి మనిషి గా జీవించటానికి కావలసిన అంగాలు, ఉపాంగాలు.

నేను రచించిన ఈ లలిత భావ గీతాలు అనే కావ్యం మీ కందరికీ ఆనందాన్ని ఇస్తుందని, మీరు ఈ కావ్యాన్ని చదివి, ఇందులోని పాటలను పాడి ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథాన్ని రూపొందించటంలో సహకరించిన వారందరికీ నా అభినందనలు.

ఇట్లు

హైదరాబాద్

భవదీయుడు

1-11-1997

**వెల్లంకి. ఉమాకాంత శాస్త్రి**

# అంకితం

ఈ కావ్యాన్ని మరపురాని గేయ కవి, మధుర భావ  కవితా శిల్పి, స్వర్గీయ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి భక్తిపూర్వకంగా కానుకగా సమర్పిస్తున్నాను.

# గీతాల పట్టిక

29. ఏ మొనరించి నే తెల్పను
30. అది చిత్రమా లేక ఒక శిల్పమా
31. ఈ లోకమంతా ఇంతేనులే
32. ఎందుకు త్రాగేవు
33. ఇదే నీవు జనియించిన భారత దేశం
34. గానం నా ప్రాణం
35. చర చర బిర బిర చేర రావె
36. రాకూ నా వెంట నీవు
37. రవ్వంటి చిన్నదాన్ని
38. ఎవరో పాడారు తీయగా
39. శ్రీవారికి ఏమని ప్రేమలేఖ వ్రాయను
40. పెనుగాలి తాకిడికి
41. తెలుగింటి పడుచుకు తీరని సిగ్గు
42. ఆడవె అందాల సులోక భామిని
43. కొత్త పెండ్లి కూతురి ముస్తాబును చూడగా
44. ప్రతియింటి లోన వెలిగే ఈ దీపాలు
45. తెలుగువాడు మావాడు
46. మట్టితోడ చేసిన ఈ బొమ్మకు
47. తెలిసిన వారికి ఈ లోకమే ఒక
48. కర్షకులం కష్ట జీవులం
49. ఎవరిచ్చారే నీకు ఈ తీయని గొంతుక
50. మా కెందుకు అచ్చరాలు రానే రావో
51. స్వతంత్ర భారత దేశంలో
52. నీకు నీవు సాయం చేసుకో తమ్ముడు
53. అందాల భామను
54. ఏదీ ఒకసారి నవ్వు
55. ఏరీతి భరియింతు ఈ విరహము
56. చూడర నా సొగసు
57. అడుగులో అడుగువేసి నా వెంట రాకు
58. ఈ ముద్దబంతి పువ్వు ఎంత ముద్దరాలో

59. అదె యమునా నది పులిన తలం
60. ఎప్పుడో ఒకనాడు పోవాల్సిందే
61. నీతిలేని మనుషులకు పదవులు ఇస్తే
62. ఒకరిది కష్టం వేరొకరి దదృష్టం
63. చెంగు చెంగంటు నాపైన దుముక బోకు
64. ఎదలోన నిన్ను నే దాచుకోనా
65. ఆడెను శివుడు తాండవము
66. జయ జయ జననీ దుర్గా భవానీ
67. ఎంత చక్కని సవ్వడి
68. రాతిరేళ ఒకసారి రామామా పోదాము
69. గొబ్బియలో గొబ్బియలో
70. సిరులొసగే తల్లికీ

# లలిత భావ గీతాలు

## 1

భారత మాతకు జేజేలు
భవ్య చరితకూ జేజేలు ॥

వీరుల ధీరుల కన్నతల్లికి
విశ్వవిఖ్యాతకు జేజేలు॥

బిడ్డలందరిని తన ఒడిలోన
తీర్చిదిద్ది లాలించి పెంచుచు
కలసి మెలసి చరియించగ గోరే
జనని కివే నా జేజేలు॥

ఓంకార నిక్వాణ యుతమ్మై
లలిత భావ లహరీ సమేతమై
అలరు నిగమ నాదములను బలికిన
అమ్మ కివే మా జేజేలు॥

మానవ జాతి మనుగడ కొరకు
మహితమైన సందేశము లిచ్చి
సకల జనులకు సంస్కృతి నేర్పిన
చల్లని మా తల్లి కివె జేజేలు॥

## 2

సుమధుర రసధుని పొంగినది
ఇదె నా కైతకు ప్రాణమైనది॥

పల్లవించిన నా ఎదలోన
భావాలు సుమజాలు మై పూచినవి॥

అనురాగము మమకారము చేరీ
మనసును ఊయలు లూపినవి
పులకించిన ఆ ప్రకృతి తల్లినను
జోకొట్టి లాలించి పాడినది॥

కన్నుల పండవుగా నున్న జాబిలి
పదముల సుధను నింపినది
వెదురు గోలలు నాదరి చేరి
వేణువు నాది ఘురిసినవి॥

కొమ్మపైన చివురాకులు మేసిన
కోకిలమ్మ గళమెత్తి పాడినది
వారిద నాద వినోదము గాంచిన
వన మయూరమే ఆడినది॥

శృతియూ లయయూ నా నెచ్చెలులై
జతగా నాదరి చేరినవి
ఆర్ద్రత అనుభూతి నాలోన వెలసి
ఆనంద లోకాల చూపినవి॥

# 3

ఎవరో ఎవరో అతడెవరో॥

ఇంత సుందరమైన ఈ లోకమును
సృజియించిన వారెవరో ఎవరో॥

వింత వింత దృశ్యముల సస్యముల
విరచించిన వారెవరో ఎవరో॥

మనిషికి మనిషికి మధ్యన ఏదో
మధురమైన అనుబంధము బెంచి
మమకార మనే రజ్జువు తోడ
బంధించు వారు ఎవరో ఎవరో॥

విశ్వమంతటా తానై యుండి
శాశ్వతమైన కల్పన చేసి
మనిషికి అందీ అందని ఏదో
ఆనంద మొసగే ఆతడెవ్వరో॥

ప్రాణిలోని ఆ ప్రాణరూపమై
ప్రణవ నాద సంచార భావముల
లీల మీరగా తోలు బొమ్మలను
ఆడించు ఆ సామి ఎవరో ఎవరో॥

## 4

జయ జయ జయ భరతావని
జయము జయము ప్రియ జననీ॥

జయ జయ మంగళ దాయిని
సకల లోక కళ్యాణీ॥

సకల రాష్ట్రములు నీ రూపముగా
సకల జనావళి నీ బిడ్డలుగా
సకల భాషలూ నీ మాటలుగా
అలరిన తల్లీ మా కల్పవల్లీ॥

హిమశైలము నీ కేశపాళిగా
కాశ్మీరము నీ నుదుటి బొట్టుగా
కన్యా కుమారి పాద పీఠముగ
అమరిన తల్లీ ఆనంద రూపిణి॥

గంగా యమునా గౌతమి కృష్ణా
పొంగి పొరలగా బంగారు పంటలు
పండించి మాకు అన్నమొసంగే
పచ్చని మా తల్లి జగదేక నాయకీ॥

మహిత సంస్కృతికి ఆదిదైవముగ
మహిని వెలసి నిగమార్థ సారమును
దేశ దేశముల పంచి యిచ్చిన
దివ్య భావ విజ్ఞాన రూపిణీ॥

## 5

మా పల్లెలే సురసీమలు
మా రైతు సోదరులే మాకు అన్న దాతలు॥

మా పంట చేలు మా పచ్చని తోటలు
మా నదీ నదాలే మాకు ప్రాణ దాతలు॥

పచ్చనైన బయళ్ళలో నీటి పట్టులందున
సంచరించు మా ఆల మందలే మాధనం
ఆ ఆలు గాచు గోపాల బాలుర
వేణుగానమే మాకు ఆరవ ప్రాణం॥

కష్టించే కర్షకుల కార్మికుల స్వేద
బిందువులే మాకు మంచి ముత్యాలు
మా వారలు శ్రమ శక్తియె మాకాధారం
అదే మాకు అభ్యుదయపు మందిర ద్వారం॥

అన్నపూర్ణ మాదేశం ఎన్నో రతనాలకూ
నెలవైనది మాదేశం ఎంతో చెలువైనది
దేశానికి మా పల్లెలె పట్టుకొమ్మలు
అవియే మా శాంతికి ఆట పట్టులు॥

# 6

విషాదాన్ని గుండెలో దాచుకో తమ్ముడూ
వినోదాన్ని అందరికీ పంచరా సోదరా॥

కుషీగా నిషాలో మునిగి పోకురా
కోరుకున్న ధ్యేయాన్ని మరచి పోకురా॥

తల్లినీ చెల్లినీ గౌరవించి నట్టులే
నీ నాతి గాని అతివ నెపుడు చూడరా.
మంచిని ప్రేమించరా మనిషిగ జీవించరా
అదే మనదు భారతీయ ఆధ్యాత్మిక బోధరా॥

కండలలో కొండనైన పిండిచేయ శక్తున్నది
గుండె బలము కలిగితే కండ బలము వచ్చురా
కష్టించి పనిచేస్తే గంగమ్మే దిగివచ్చు
విను వీధి నుండీ హిమవంతము పై నుండీ॥

ఆరని తీరని మంటల నన్నిటినీ హరియించి
అజరామరమైన ధర్మ యజ్ఞమును సేయగా
అడుగు ముందుకేయరా ఆత్మజ్యోతి వెలిగించి
పదిమందికి దీపిక వై బాట చూపి నడవరా॥

 లలిత భావ గీతాలు

## 7

నమో నమో భరత మాత
నమో నమో పూత చరిత॥

నమోస్తుతే సకల సుగుణ
పరిపూరిత శుభదాతా॥

అమేయ రత్న సంకలితా
అజేయ వీర శోభితా
అపార శక్తి భాసితా
కృపా కటాక్ష రాజితా॥

లలిత లలిత భాషాన్విత
శత సహస్ర సంతానా
కలిత దివ్య మాతృమూర్తి
దిగ్దిగంత వ్యాప్త కీర్తి॥

సమతా మమతల భావం
జగతికెల్ల చాటి చెప్పి
అందరి క్షేమమె నా ఆనందమనే తల్లీ
అందుకో వందనాలు ఆశ్రిత జన కల్పవల్లీ॥

## 8

ఏ రూపములో నున్న నిన్ను ఓ
స్వామి నేను చూడగలనొ
ఎరుగ జాల నీవేనా
కెరుక పరచరా దేవా॥

కొండల పై నుండి గండు శిలల దాటి
పరుగుల నరుగుల ప్రవహించి జలధి
చేరు నీరమున ఉన్నావని నే
చేరి చూడనా నదుల తీరముల॥

మ్రాకుల కొమ్మలపైన పచ్చగా
ఉన్న పత్రముల ఫలముల లోన
పూచిన లతల పూల తావిలో
ఉన్నావని నే వెదకనా ప్రభో॥

శిల్పులు చెక్కిన రమ్య శిల్పముల
తోడ నిండిన గుడి గోపురముల
చూడ మందువా మాటి మాటికి
జాడ ఏమొ మా కెరుక పరచరా॥

మనసూ మమత కలిగిన మనిషి
మంచి తనములో నిను దర్శింపనా
మతముల కులముల ఎల్లలుదాటి
మసలే మనిషిలో నిన్ను చూడనా॥

ప్రాణి లోన చెలువారు ప్రాణమై
ప్రణవనాద మధురాను భూతియై
జగతి ఎల్ల వ్యాపించి యున్న నిను
చక్కగ నా ఎద లోన చూడనా॥

 లలిత భావ గీతాలు

## 9

ఈనాటి మొక్కలే రేపటి ఫల భూజాలు
ఈనాటి మొగ్గలే రేపటి అందాల పూలు॥

ఈనాటి బాలలే రేపటి పౌరులూ
వీరే ఒక నాటికి దేశ నేతలు॥

పసితనము లోనున్న పాపనూ బాబునూ
మధురమైన మన వేద సంస్కృతిని రంగరించి
ఉగ్గుబాల తోడ గలిపి పోసి పెంచాలి
ఉన్నత మౌ మార్గంలో తీర్చి దిద్ది మించాలి॥

తల్లియే మొదటి గురువు తండ్రి బాట ఎల్లప్పుడు
పిల్లలకు ఆదర్శం వారి మాట వేదము
ఉన్నత మౌ వ్యక్తుల బాటలే గమ్యము
అగురీతి చేయుటే తల్లి దండ్రి ధర్మము॥

శాస్త్రము విజ్ఞానము దేశానికి ప్రగతి నిచ్చు
సంస్కృతి సభ్యత మనిషిని ఒక మనిషిగా
తీర్చి దిద్దు ఈ రెండూ సత్యమైన మాటలు
ఇవే భరత జాతికి అభ్యుదయపు బాటలు॥

## 10

అందరూ రారండి అర్చింతామూ
మనల గన్న భరతాంబకు మంగళ హారతులు॥

అందముగా ఆసేతు శీతాచల పర్యంతం
అలరారే అమ్మనూ అర్చింతాము॥

ఎన్నో రాష్ట్రాలున్నా ఎన్నో ప్రాంతాలున్నా
అందరిపై ఆమెలోని మమకారం సమమే
ఏ భాష వారైనా ఎవ్వరు మాటాడినా
ఆ తల్లికి ఆ మాటలు ముత్యాల మూటలే॥

అన్ని కులాలూ అన్ని మతాలూ
ఆ తల్లి కనులకూ కలువ రేకులు
ఆ తల్లి గుండెలో దాచి యున్న ప్రేమ సుధ
అందరికీ పంచి యిచ్చు అందుకుందాము రండి

ఎందుకు వైరాలు ఎందుకు భేదాలు
అందరమూ ఒక జాతిలోని వారమే
కలసి మెలసి ఈ దేశపు అభ్యున్నతి కోరి
చేయి చేయి కలుపుదాం గళమెత్తి పాడుదాం॥

లలిత భావ గీతాలు


## 11

తనవు నీది మనసు నీది
దరిచేర రారా ఓ సుందరా॥

కనుల లోన నీ రూపము నిలిపి
క్షణమొక యుగముగ నేనున్నదాన॥

విరిసిన వెన్నెల వేడి తోడ
పొంగెను నా ఎద నిల్వగ జాలు
మరుని తూపూల తాకిడి కోర్వగ
నే చాలనురా బిగి కౌగిలీరా॥

ఎవ్వరికైనా అందనిదీ ఈ
జవ్వనము ఈ సోయగము
కవ్వించు నవ్వుల పువ్వుల తోడ
రాజిలు అందాల విరితీవను॥

అందాల కెమ్మోవి అందించ వేచి
ఉన్నానురా నెర జాణనురా
తమి మీర సుధను త్రావి త్రావి
సురలోక భోగాల రుచి చూడరా॥

ఈ రేయి ఈ వలపు కెరటాలు నన్ను
అనురాగ సంద్రాన ముంచక మున్నే
దరి జేర్చి నా తపన తీర్చ రారా
నే తాళ జాల ఈ జాలమేలా॥

## 12

దోర వయసు దొరసానీ
పరుగిడి పరుగిడి పోబోకు॥

కోరమీసం చినవాడా
కొంటె చూపులు చూడకు॥

నడిచే నడకకు నీ నెన్నడుము
నాట్యము చేసెను ముచ్చటగా
జారిన నీ జడ లోని పూవులు
రాలెను ఇవిగో నా దోసిలిలో॥

ఆకాశంలో తారక నందగ
చాచకు చేయి గగనాని కెగసి
కాలు జారితే తూలి పడేవు
కలలెల్ల గల్లంతుగా మారి పోవు॥

ఒకసారి ఒకసారి యిటు చూడవే
ఒద్దికగా నున్న నీ ఎదపైనా
తల ఉంచి నన్ను నిదురించ నీవే
నీ కనుల ముద్దుల ముంచ నీవె॥

అంతంత పెద్ద కోరికలున్న
గుండెల్లో ఏమాత్రం సత్తువున్నా
అమ్మా నాన్నా ఉన్నారు రండి
అడగండి ఆ మూడు ముళ్ళువేయ॥

లలిత భావ గీతాలు


## 13

చిక్కింది నా చేత చిలుక
నా పక్కలోన చక్కని మాటలు పలుక॥

చాలింక రాగాలు గోరువంక
సరసాలు చాలింక ఓ నెలవంక॥

ఎగసి ఎగసి పడబోకు జారుపైట విడబోకు
నీసోకులోన నను ముంచబోకు
ఏనాటికైనా ఎట్టని నీ పెదవి
నా పెదవి కంది సుధలెల్ల చిందు॥

ఇంతకన్న మగసిరి కలవాడు లేడని
ఈ లోక మందున మొనగాడ వీవని
చూపించి నన్ను మెప్పించి మాటాడు
చూతము అప్పుడు నీ జోడు గోడు॥

చిన్ననాటి నుండీ నిన్నుకోరి ఉన్న
మగవాడనే నే మొనగాడనే
ఎవడడ్డ మొస్తాడో రానీ చూతాము
నిన్నే పెళ్ళాడుతా ఆపైన చూపుతా॥

అది అంత సులువు కాదు అందరికి నచ్చింది
పెళ్ళాడలేవు వళ్ళు దగ్గరుంచుకో
మా నాన్న మా అన్న నిన్ను చూచారంటె
మనిషి మనిషి తీరాన ఉండబోవు కాచుకో॥

## 14

పలికింది ఒక రాగము
పాడింది ఒక గేయము॥

నాలోన నిండి పొంగారు వలపు
నవభావ శిఖరాల పైనుండి పొరలి॥

ఏ కుంచియ లేకుండా గీచితి నా ప్రియురాలి
మధురమైన రూపమును మనుసులోన చిత్తరువుగ
ఆమె కాలి అందియలు ఘలు ఘల్లుమని మ్రోగి
నా ఎదలో వినిపించెను నా మేను పులకించెను॥

గంగానది తరగలలో కానిపించు స్వచ్ఛత
నా చెలి కనుదమ్ములలో చూచితి ఉప్పొంగితి
పొంగి పొరలు గోదావరి కెరటాల తాకిడితో
పొంగిన నా నెచ్చెలి ఎద పులకించగ చూచితి॥

నీలి కురుల పాయలుగా విడదీసి జడనల్లుచు
నవ్వులతో మల్లెపూలు సవరించుచు
పరువు లెత్తు కృష్ణవేణి బోలిన నా ప్రియురాలి
కడగంటి చూపులను కని మురిసి పోతిని॥

ఆమె కనులు కలువలా అరవిందాలా
ఆమె నవ్వులే మల్లికలా సన్నజాజాలా
ఆమెకు సరిసాటి రాదు ఆ మరుని వధూటియైన
ఆమె రూపమే నాలో వెలుగు అమర దీపము॥

లలిత భావ గీతాలు


## 15

ఎవరో పిలిచారు
నన్నెవరో పిలిచారు॥

ఓ ప్రియా ఓ సఖా
అని నటుల తీయగా॥

మధుమాసపు వేళలో
ఈ పున్నమి వెన్నెలలో
ఎల కోయిల గొంతుకతో
పంచమ సుస్వరముతో॥

సవరించిన వీణ
సరిగమ పద నిస యని
సప్తసుస్వరాలు
పలికించిన భంగిమలో॥

గాలియలల తాకిడికి
కదలిన చివురాకులు
సడిసేసిన రీతిగా
గుసగుసలు పోవుచూ॥

పరువులెత్తు సెలయేరు
తరంగాల ధ్వని వలె
ఝుమ్మని సుమ వల్లరిపై
చేరు మధుప రవళి వలె॥

ఆమె గొంతు కాదు కదా
నా రాణి గొంతు కాదు కదా
అది కాకయున్న ఆ సవ్వడి తో నాదు
ఎద ఏల పులకించు
ఏలమేను పరవశించు॥

## 16

ఆగకు దూరాన ఓ వన్నెలాడి
ఆగలేను నేను నీ దరి చేరకుండా॥

చాలు చాలు ఆగడము ఇది నడి వీధి
జనమంతా నవ్వేరు మనలను చూచి॥

వయసు తోడ పొంగులు పొంగేటి చినదాన
నీ వంపు సొంపులు చూచి నేను నిల్వలేను
రావే అందాల రాశి రవ్వల మొలకా
ఒక్కసారి ముద్దీవె బంగారు చిలుకా॥

ఒళ్ళంతా సిగ్గుతో మునిగి పోయినాది
చాటు మాటు లేకుండా సరసాలు చాలు
వీధి లోన భాగవతం ఆడకు నా తోడా
చేని గట్టొ నీటి పట్టొ చేరర చెలికాడా॥

పదిమంది చూస్తే అందులో ఏముంది
సినిమా షూటింగ్‌ని అనుకుంటారే
ఆగలేను నీ కౌగిలి ఒకసారి ఈయవే
వేడి వేడి ముద్దులతో నిన్ను ముంచనీయవే॥

ఆ కోరిక లన్నీ నాకూ ఉన్నాయి
అదిరేటి అధరాలు ఒకసారి చూడు
ఒట్టొటిట్ట కౌగిలితో తీరదురా ఈ తపన
గుట్టుగా నడిరేయి నను చేర రారా॥

 లలిత భావ గీతాలు



మరువ లేనేమీ
ఆ చెలి మోహన రూపం॥

ఆ దరహాసం ఆ విలాసం
ఆ నవయౌవన శోభావికసం॥

ఆమె నెమ్మోము పదియారు కళల
విలసిల్లు పున్నమి వెన్నెల రేడు
ఆమె కన్నులే సరసి లోపల
విరిసిన కల్వల రేకుల జోడు॥

ఉన్నదో లేదో ఆమె సన్నని నడుము
కన్నుల ముంగిట కనిపించ దది నాకు
శృంగారము తో పొంగిన ఆ లేమ
ఉరమ పైననే నా చూపు నిలచు॥

అవి అధరాలా మధుర సుధలనూ
అందించు నందన వన ఫలాలా
అవి ఆమె కడగంటి చూపులా లేక
మరుడు సంధి ంచెడు శాత శరాలా॥

ఆమె శిల్పమా ధాత సృజించిన
అపరంజి బొమ్మా సకల జగాలను
మోహింప జేయగ జాలిన ఒక దివ్య
దీపమా సౌందర్య దేవత రూపమా॥

## 18

ఘల్ ఘల్లంటు నీ కాలి గజ్జె కదలిన వేళ
నా వళ్ళు పులకించు నేమే చెలీ॥

ఛెళ్ ఛెళ్ళంటు నీ చెంప మోగించు దాకా
కాకెక్కి నీ వళ్ళు అటు లుండులే॥

ఊరికి దూరాన కొండల మాటున
సెలయేటి వంపులో చెఱకు తోట మధ్యలో
ఉన్నాము నన్నెవ్వ రాపలేరు
ముద్దులతొ నీ బుగ్గ మునిపంట కొరుకుతా
చెరకు రసము తాగినటుల నీ పెదవి జుఱ్ఱుతా॥

కొడవ లుంది చేతి లోన కోతకోయ వచ్చాను
భద్రంగ నీ వళ్ళు చూచుకో పిల్లడా
నన్నూ ముట్టావంటె నీ ముక్కు నే కొసి
కాకులకు గద్దలకు తాయిలం పెడతాను॥

కన్నుల్లో నీ పొగరు నీ వంటిలో వగరు
నీ రొమ్ముల ఠీవి నా కెరుక లే
బలమైన నా గుండె కండల తోడ నిన్ను
వాటేసు కుంటాను వదలనే వదలను॥

పెడదారి ఎందుకు పెద్దవాళ్ళ నడగ రాద
అంత మొనగాడ వయితె మనువాడ రాదా
ఆపైన ననుచేరి రేయి పగలు కూడ రాద
లేకి మాటలాడితే వాయించి పంపుతా॥

# 19

నన్ను చేర రారా ఇట
నీ కొరకై వేచియుంటి
ఎన్నినాళ్ళు నీ రాకకు
ఎదురు చూతునో సఖా॥

ప్రతిలేఖకు బదులు వ్రాసి
అలసి పోయినాను రా
గుండెలోన పొంగు కోర్కె
ఎటుల తీర్చుకొందురా॥

ప్రతి పున్నమి రాతిరిలో
వెన్నెల నా తనువు నెల్ల
దహియించును మల్లె లెల్ల
నన్ను చూచి హసియించును॥

కోకిల సుస్వరము నాదు
గుండెలోన మారుమ్రోగి
కలచును నామది నెల్లను
కడలి లోని కెరటమై॥

కనులకు నిదురన్న దెపుడో
కరువాయెను ఈ తనువు
ఎల్ల చెక్కి సగమాయెను
ఏమని నే తెల్పుదు॥

నీవు రాక ఉన్న యింక
నే మన లేను
నిముషమైన మరుని బాధ
కే నోర్వగ లేను॥

# 20

పాడనా గొంతెత్తి
ఒక తిల్లానా
ఆడనా అందియలూ
ఘలు ఘల్లనా॥

పొంగిన సెలయేరు వలె
పొరలి పోవనా
తారకనై గగనానా
తళుకు లీననా॥

ఊహల లోకాలలో నేను రాణిని
యౌవన సామ్రాజ్యాన్ని ఏలు జాణను
నేను కోరుకొన్న వాని నా కొంగున ముడివేసి
అనురాగపు డోలనూపి విను వీధి చూపనా॥

కోయిలతో సరిసాటిగ పంచమ సుస్వరముతో
కుహూకుహూ మని నేను గీత మాలపించనా
నీరదాల చూచి మురిసి పరువెత్తు మయూరినై
కాలు కదిపి ఆడనా లోకాలు మురిసి పోవగా॥

పరువెత్తే సెలయేరులు నా పాటకు మృదంగమై
గమకించగ నా హృదయం పరవశించి వీణయై
రసమయమౌ రాగాలను నినదింప జేయగా
తకధిమ్మని తకధిమ్మని అడుగులు నే వేయనా॥

 లలిత భావ గీతాలు 

## 21

ఏమన్నది ఏమన్నది
ఆమనిలో కోయిల ఏమన్నది॥

ప్రేమన్నది మనసుల
కలయిక యని అన్నది
ప్రేమించని వాడు
మనిషి కాడన్నది॥

పసిబిడ్డను తన గుండెల లోదాచి మురియుచూ
పాలిచ్చే కన్న తల్లి గుండెలోన దాగున్న
అపురూపమైన భావమే ప్రేమన్నది
అది ఎరుగని వారు మనిషి కాదన్నది॥

తనవారిని అందరినీ దూరము గావించుకొని
తనువు మనుసు ఒకరికే అర్పణ చేసి
గుండెలోన చోటిచ్చే ప్రియురాలి ఎదలోన
దాగున్న భావమే ప్రేమన్నది॥

విన్నావా ఆ కోకిల ఊహూ ఉహూ అన్నది
కన్నతల్లి కన్నా దైవము లేదన్నది
తన బిడ్డల నోటిలో చివురుటాకు లుంచుచూ
ముద్దాడే దాని ముచ్చటనూ చూడవే॥

చాలు చాలు ఆ కోకిల కవ్వింతలు చూడండి
మేనెల్ల పులకించా కుహూ కుహూమని కూసి
ప్రియురాలిని ముద్దాడి మురిసి పోవు చున్నది
ప్రేమంటే యిదే నని చాటి చెప్పు చున్నది॥

ఈ నాటి ప్రియురాలే రేపటి తల్లి
ఇది జీవితమందలి నిత్య సత్యము॥

మీ గుండెలోన నాకు చోటు ఇవ్వండి
ఆపైన ఆవేదం మీరు వల్లె వేయండి॥

## 22

ఆహా ఏమి అందును
దీని చూచి నా డెందం
మురిసి పోవు పరవశించు
పరుగులు తీయు॥

కమ్మనైన వాసనతో నోరూరించు
ముచ్చటైన రూపుతో ముద్దనిపించు
వేడి వేడి ఈ పకోడి వెలకట్టగ లేనిది
వేల్పులైన విందులో ఆరగించ కోరునది॥

తాజాగా మరలోన పట్టినట్టి శనగపిండి
కొని తెచ్చి నీటితోడ తగు చిక్కగా కలిపి
సన్నగా తరిగిన ఉల్లిపాయ ముక్కలు
కొతిమేరు అందులోన సమముగా వేసి
కారము ఉప్పూ చేర్చి స్వచ్ఛమైన నూనెతో
కరకర లాడెడు రీతి వేయించిన దానిరుచి॥

ఒక ప్లేటా రెండు ప్లేట్లా
ఎన్నైనా తినవచ్చు
దాని తిన్న వారలూ స్వర్గానికి చేరువలో
ఉందురిది నూటికి నూరుపాళ్ళు సత్యము
ఊహల సామ్రాజ్యాన్ని ఏలుదురూ నిత్యము॥

 లలిత భావ గీతాలు



సిగ్గేలా మాటలు రావా
విరిసీ విరియని మల్లె మొగ్గవా॥

పరువముతోడ పరుగులు తీయక
భ్రాంతి ఏల చేమంతి పూవు వలె॥

ముడుచుక పోకు నవ్వులు నవ్వు
ముత్యాలు రాసులు రాలి నటుల
కడకంటి చూపుల నావైపు చూడు
కలువల మాలిక లల్లి నటుల॥

బుగ్గల పైన పూచిన కెంపుల
నా చేతులతో దాచనీవె
వణికే నీదు క్రీ పెదవి పైన
ఒక్కసారి నను ముద్దాడనీవే॥

దాచగ లేవు నీ ఎదలోని
తలపుల నన్నీ ఓ సుందరీ
ఎగసిన ఉరము సొగసులు మీరి
ఎన్నో గుట్టులు రట్టు సేయును॥

వాల్జడ తోడ నడుమును దాచ
వీలను కొంటివ కాదది సాధ్యము
హెచ్చిన సిగ్గుతొ నీ కాళ్ళు తడబడు
విచ్చును నీదు కోక ముడి॥

పాలూ నీరూ కలసి పోవా
పూవూ తావీ వేరగు నా
నీవూ నేనూ ఒకటయి పోయే
ఆ రోజూ ఈ రోజూ అనుకోచెలీ॥

## 24

అందం అంటే నీదే
అది నా ఒక్కడికే సొంతం॥

సోడాబుడ్డి మాటలు చాలు
బోల్తాపడను నీ ఆటలకు॥

పూవుల లోని తెనెనాన
తేనెటీగయే వాల్తుంది
అది ఝుమ్మంటే నీ గుండెలోన
కోటి వీణలే వినిపిస్తాయి॥

నిరుకు లేని నీలాటి మనిషి యొక
కందిరీగ యని నాకు తెలియును
నీవు మూగి నను కరిచే దాకా
నేనిక్కడుండను దూరం వెళతా॥

అత్తా మామా ఆరడి లేదు
తెచ్చిన దంతా నీకే ఇస్తా
ప్రతి నిముషం నిను ముస్తాబు చేసి
నీతో నేనూ కలిసుంటా॥

కూలికి పోయి రిక్షా గుంజీ
కూడ బెట్టినది ఏమైన ఉందా
కల్లొ సారా తాగే నీకూ
ఇల్లా లెందుకు ఇల్లెందుకురా॥

నిను పెండ్లాడిన మరుసటి నాడే
నిలకడ కుదురును నా బుద్ధికి
అన్నీ వీడి నాతోడ కూడి
అమృతం తాగే రోజొస్తుంది॥

పెండ్లి కుదిరితే పిచ్చి కుదురునని
పెద్ద పెద్దగా మాటలు చెప్పకు
కుక్క తోకకు వంకర తీరునె
గుణము మారునా మేడి పండుకు॥

లలిత భావ గీతాలు

## 25

నవ్వాలి నవ్వాలి నీ నవ్వే నాలో
నవరసాలు నించా నా మేను పరవశించ॥

పువ్వులెల్ల విరియ బూచి
మలయానిల మే సోక
పరవశించి పరిమళాలు
విరజిమ్మిన రీతిలో॥

పున్నమి వెన్నెలలు సోక
పొంగిన చెంగలువలు
గాలి సోకి పులకించి
గలగలమని యన్నటుల॥

పొంగిన గోదావరి
పొరలి పొరలి కెరటాల
నురువులుతో దరిని దాక
పరువెత్తి నట్టుల॥

అమవస నిశినాడు
దీపావళి రాతిరిలో
దివ్యదీప కాంతులు
ప్రసరించిన భంగిమలో॥

కాలి యందె కదిలి నటుల
గాజులు కదలాడి నటుల
తళతళ మని గగనాన
క్రొమ్మెరుపులు మెరసి నటులు॥

వేణువు వీణా కలిసి
ఒక రాగం పలికి నటుల
సరసి లోని తరగలతో
జల తరంగి లైనటుల॥

నీ నవ్వులు నా గుండె లో నిలచి పోయి
అనుదినము ప్రియా ప్రియా అని ధ్వనులు సేయ॥

## 26

కొత్త పెళ్ళి కూతురిలా ముస్తాబయినావు
ఏమిటే విశేషం ఏమీ సంతోషం॥

సందెవేళ పెందలాడె ఇంటికి రండీ
చక్కనైన ఒక కబురూ చెబుతాను మీకు॥

మల్లెపూల దండలు తెమ్మంటావా
తీయనైన స్వీట్లు కొని రమ్మంటావా
పట్టు చీరె పట్టు రవిక పట్టుక రమ్మంటావా
తొలి రాతిరి వలపు తీరు రుచి చూపిస్తావా॥

అంత తీరుబాటు మీకు లేదని తెలుసు
ఆఫీసే మీ ముద్దుల అర్ధాంగి యని తెలుసు
అయినా నే గుర్తుంటే తొందరగా రాండీ
అపుడు మీకు చెబుతాను ఆ ముచ్చటేదో॥

చక్కనైనా ఏదైనా సినిమాకు వెళదామా
జాయిరైడుగా టాంకుబండు చూచి వద్దామా
వెంకటేశ్వర స్వామి మందిరాని కెళదామా
ఏమిటో నీ కథ భామినీ చెప్పవే॥

దయచేసి తొందరగా వెళ్ళిరండి మీరు
తీరికగా చెబుతాను ఒక చిన్న మాట
మీ రాకకు నే చకోరి నై వేచి ఉంటాను
మీ కొరకే టిఫెను చేసి నే ఎదురు చూచేను॥

ఊరించకే నన్ను ఉన్నదేమొ చెప్పవే
ఆఫీసుకు ఫోను చేసి లీవు పెట్టమంటావా
అక్కడికీ వెళ్ళినా మనసిక్కడే ఉండి
ఆ పనీ కాదు ఈ పనీ కాదు॥

అయ్యో ఏదో సిగ్గు నన్ను చెప్పనీయదండి
అయినా సాయంత్రం త్వరగా రండీ
ఒకసారి డాక్టరుకు చూపించుకుందాము
ఒక్కరో ఇద్దరో తేల్చుకుందాము॥

లలిత భావ గీతాలు


# 27

శారికా అభిసారికా
మరుని మనోహర దీపికా
బిర బిర నన్ను చేరగ రావె
వలపుల వెన్నెల మాలికా॥

విరిసీ విరియని నీ కనుదమ్ముల
కురిసే ప్రేమకు నే తాళ లేను
ముగ్ధమనోహర మౌ నీ రూపము
చూచుచు ఊరక నే నిల్వ లేను॥

కులుకుల నడకల నడచు మరాళీ
నాట్యము చేసే వన మయూరీ
శృంగారమే రూపు తాల్చిన రాణీ
నీ కిదే జోహారు ఓ విరిబోణీ॥

బిగి కౌగిలి లో బంధించ నీవే
ఎదపైన ముద్దుల తో ముంచనీవె
అధర సుధలను అందించ రావే
అలరు విల్తు వెత తీర్చగ రావె॥

ఒక పరి నా చెవి దాపున చేరి
ప్రేమికా యని పిల్వగ రాదే
నా గుండెలోన నీ ఊపిరితో
వేణువు నూది వినిపింపరాదే॥

ఎన్నో జన్మల అనుబంధమే ఇది
తెలియవే చెలీ మరువగ రాని
స్వర్గ సుఖాల చవి చూపించవె
జగమును ఊయల చేసి ఊచవె॥

## 28

మహాదేవా హర శంభో శంకర
గిరిజా రమణా చంద్రశేఖరా॥

తాండవకేళీ లోలా శూలీ
శంకర నటరాజ శివ నందివాహనా॥

ఉప్పొంగు గంగనై హిమశైల శిఖరాల
పైనుండి దూకి నీ జటలోన
చేరి నీకు అభిషేకము చేయనా
హాయిగ నీకు సేద దీర్చనా॥

గిరిజా రమణీ వేషము తాల్చి
ముగ్ధ మనోహర రూపము తోడ
కాలియందెలు ఘల్లున మ్రోయ
రమణీయ లాస్యము చేయనా ప్రభో॥

నమక చమక మంత్రములు పలుకుచు
ఓంకార నిక్వాణము చెలగగ
వేద నాదముల ననుసంధించుచు
వేయి నామముల నిన్ను కొల్వనా॥

విశ్వమయా సర్వేశ మహేశా
విబుధ లోక పరితోషిత వేషా
శాశ్వత శ్రీ సచ్చిదానందరూపా
ముని మానస మంగళకర దీపా॥

కదలి రారా నా అంతరంగమను
సదనము నందున నిలచిపోవగా
కదలిరారా నను కరుణ జూడగా
కలుషభంగ ఘన వృషభతురంగా॥

## 29

ఏమొనరించి నే తెల్పను
నాలోని వలపు ఓ నెలరేడా॥

ప్రేమతోడ నీ చెంగట జేరిన
భామను నన్నేల జాలమేలా॥

తారక నై గగనమ్ము లో కెగసి
తళుకు తళుకు మని నాట్యము సేయనా
మెరసే మేనితో మిరుమిట్లు గొలిపే
మెరపు తీగనై మేలమాడనా॥

బృందావనిలో యమునా తటిలో
కమ్మగ గళమెత్తి ఆనందముతో
ఆనందభైరవి రాగము పాడే
ఆరాధగా నిన్ను ఆరాధించనా॥

అంచ నడకతో క్రీగంటి చూపుతొ
అనురాగ సుమముల మరుని మరులుకొను
రతినై హంసధ్వని రాగమ్మును
రమ్యముగా నే నాలపించనా॥

సరసగతులతో జావళీలను
చక్కగ పాడి కాలి యందియలు
కదిపి నాట్యమును చేసి నీదు పద
కంజములకు కుసుమాంజలి నిడనా॥

## 30

అది చిత్రమా లేక ఒక శిల్పమా కాక
అపురూప మైన అపరంజి బొమ్మా॥

కలలోన నేను కన్నులతో గంటి
కౌగిలిలో నామె నే దాచుకొంటి॥

ఆమె ముంగురులు తేటుల బారు
ఆమె నెమ్మోము చందురు గేరు
ఆమె కన్నులే సరసిలో నడయాడు
గడుసైన మీలకు చక్కని జోడు॥

ఆమె కంఠమే శంఖమై రాజిలు
ఆమె పెదవులు చిందు అమృతపు జాలు
ఆమె గళమున వెడలిన రవము
అది వాయులీన ధ్వని తోడ సమము॥

సువిశాల మైన ఉత్తుంగమైన
ఆమె వక్షోజాలు కన్నుల పండుగ
ఉన్నదో లేదో ఆమె కౌను
కనిపించ లేదది కలయో నిజమో॥

నూగారు దాటి నిలచిన నా చూపు
కడులోతుగా నున్న నాభి జూచెను
కనులను వంచి నే గాంచి నాడా
అరటి బోదెల బోలు ఆమె తొడలా॥

ఆమె పాద పల్లవములపైన
అమరియున్న పారాణి గాంచితి
ఆమె కాలి అందియల సవ్వడి
వింటి నామె రూపమును గంటిని॥

ఆమె నొసటి కుంకమను గాంచితి
ఆమె కనుల కాటుకను జూచితి
ఆమె గాజుల గలగల వింటి
అంత నేను వెస మేలుకొంటి॥

## 31

ఈ లోకమంతా ఇంతేనులే
ఈ నిజ మెరిగిన నీకు మేలులే॥

అనాది నుండీ పేద, ధనికుడు
అన్నవి రెండూ ఉన్నవి లే॥

కష్టించి ఒకడు పొలమును దున్ని
పంటల పండించి గాదెల నింపు
తక్కువ రేటుకు దాని కొని
బొజ్జను పెంచును వేరొకడు॥

ఇటుక పైన నొక యిటుకను పేర్చి
కూలి కోసమై సౌధాన్ని గట్టి
పొట్ట నింపుకొను నొక మానవుడు
పొంగిపోవును గృహయజమాని॥

పవలూ రేయీ శ్రమించి కార్మిక
వర్గము చేయును వస్తువులు
వాటెను అమ్మి లాభాల తోడ
కోటలు కట్టును యజమాని॥

రిక్షా దొక్కి కూలీ చేసి
రెక్కలు ముక్కలు చేసుకొనే
వాడొకడైతే వాని నెత్తిపై
వర్ధిలు వాడు వేరొకడు॥

బావులు చెరువులు నిర్మించినా
బస్తీ రోడ్లను వేయించి నా
ఆన కట్టలను కట్టించినా
తాజ మహలునే నిర్మించినా
అన్నీ కర్షక కార్మిక శక్తే
అది ఎరిగిన నీ బాధకు ముక్తీ॥

## 32

ఎందుకు త్రాగేవు నీ వెందుకు త్రాగేవు
ఈ సురలో ఏముంది ఇందలి సుఖమేమీ॥

ఆశయాలు లేవా ఆలోచనా లేదా
అధమమైన ఈ మార్గం ఎందు కెన్నుకొంటివి॥

గత జీవిత పథంలో రేగిన మంటల నెల్ల
చల్లార్పగ త్రాగేవా జాలిదూలి త్రాగేవా
ఒక్క క్షణం నీ గుండె దాని తోడ చల్లబడి
మరో క్షణం దానిలోన మంటలే రేగునే॥

మానవత్వమే లేని మనుషులు నిను గురిచేసిన
హింసను మరువగ దారి యిదియే యని నమ్మితివా
పోయినదేదీ నీకు మరల తిరిగి రాదు
గత చరిత్ర నెమరు వేయగా లాభము లేదు॥

విషాదాన్ని నిషాలో ముంచివేయ దలచితివా
విషముకన్న ఎంతో ఇది చెడ్డది
నీ గుండె బలిమిని నీ కండల శక్తిని
నిలువున దహియించు నిది నిముషాలల్లో॥

ధనము మానము పోవు నినునమ్మరు నీ వారు
కుక్క కూడ నిను చూచి బౌబౌ అని మొరుగును
నీ చరిత్ర నీచమై నిలచి పోవు జగతిలో
నీవారలు దారి గనక విలపించేరు॥

అజ్ఞానంతో నడవకు ఆత్మధృతిని వీడకు
మందు బాట విడవోయి మంచిదారి కనవోయి
మానవత్వమును పెంచే మార్గాన పయనించి
పదిమందికి శ్రమశక్తిని పంచి పెట్టవోయి॥

## 33

ఇదే నీవు జనియించిన భారత దేశం
ఇదే నీదు మహిత మైన భారత దేశం॥

కాశ్మీరము నుండీ కన్యాకుమారి వరకు
ఒక్కసారి చూడరా ఉజ్వల మౌ దేశాన్ని॥

గంగా యమునా కృష్ణా గోదావరీ నది
పొంగి పొరల సస్యసుశ్యామలయ్యై అలురునది.
జగతిలోన మిన్నయౌ ఖనిజ సంపదల కల్గి
పెరవారి కన్నులకు మిరుమిట్లు గొలిపినది॥

మనకున్నా వేదాలు సంస్కృతులకు మూలము
ఒకనాడు మనకున్న జ్ఞానమే అపూర్వము
గతచరిత్ర వైభవము స్మృతిలోన నుంచుకొని
అడుగు ముందుకేయరా అదే యిచ్చు విజయము॥

కులమతాల భేదాలను మనసులోన నుంచుకురా
భాషా ప్రాంతీయ దృష్టి మరచి పోయి మాటాడర
మానవులంతా ఒకటే అను సత్యం లోన తెలిసి
మానవత్వమే ధర్మం అని చాటర మానవుడా॥

అవినీతి హింస అందరికీ శత్రువులే
అనాదిగా మన బుషులు ప్రవచించిన సత్యమదే
అందరమూ ఏకమై వాటె రూపు మాపి
అందుకొన్న స్వరాజ్యాని అనుభవించుదాము॥

ఎందరో మహనీయుల త్యాగపలము ఈ రాజ్యం
ఎందరో కన్న కలల ఫలితం ఈ రాజ్యం
అందరి ఆత్మలు శాంతితోనుండ దీన్ని
రక్షించుట మనవంటు రారండీ ముందుకు॥

## 34

గానం నా ప్రాణం
నాట్యం నా హృదయం॥

శృతిలయలే నా తల్లిదండ్రులు
యతులూ జతులూ నా చుట్టాలు॥

కమ్మనైన భావాలను పొదిగి
కవులు జీవమును పోసిన పాటలు
నా ఎదలోన వేణుగానమై
నవ్యముగా వినిపించేను॥

అన్నమయ్య వెంకన్న పదములకు
అలరును నాదు నెమ్మేను
త్యాగరాజుని రాముని కృతితో
పరవశించును నా తనువు॥

జయదేవుని ఆ అష్టపదులకు
పరవశించి నే రాధిక నౌదు
తీర్థుల వారి తరంగాలతో
పొంగి పోయి నే నర్తన సేతు॥

క్షేత్రయ్య హృదయాన పుట్టిన
చెఱకు రసము నా కెంతో ప్రీతి
రామదాసుని కీర్తన లోని
రమ్యతయే నా కెంతో ఇష్టం॥

అదె తానం ఇదె రాగం
అదె రమణీయ మృదంగ నినాదం
అదె కదలాడిన శింజనీ రవం
అదె నా హృదయం లోని స్పందనం॥

## 35

చర చర బిర బిర చేర రావె
నీ అడుగుల సడి నే నృత్యము విన॥

ప్రేయసీ అనురాగ భావనా
జీవన వాహిని రావే॥

సిగ్గుల మొగ్గలు శిరమున దాల్చి
బుగ్గల నిగ్గుల కెంపులు పొంగగ
గగన వీధి లో ఇంద్ర ధనువు వలె
కదలి రావె నా ముంగిటకు॥

గిరి శిఖరాల పరువులు తీసే
మేఘ మాలికల లోన దాగిన
తటిల్లతను తలపించు రీతిలో
తరలి రావె నా చెంత చేరగా॥

పొంగి పొరలు జలపాతపు శోభను
పొంచి చూచు రాయంచ విధాన
నడిచి రావె అందాల భామినీ
నడక లోని నీ కులుకులు చూడ॥

అందీ అందని చందమామ వలె
అడవిలోన చరియించు లేడి వలె
మొయిలు రాకకు పరవశించిన
ముద్దుల శిఖి వలె నర్తించ రావే॥

# 36

రాకూ నా వెంట నీవు॥
నన్నూ నీ వెంట రానీ॥

నా వెంట నడచి రాకు
నీ వంటె నా కిష్టం
ఉందంటూ చెప్పలేను
లేదంటే ఒప్పలేను॥

మీయింటి గూటి లోన
దాగున్న పావురాయి
నాతోడ చెప్పింది
నీ హృదయం లోని మాట॥

బాజారు వారెల్ల
మనల చూచి నవ్వేరు
పగలే ఈ రోడ్డు మీద
పడ బోకు నా వెంట॥

సిగ్గెందుకు నీకు
చిన్నారి నే నిన్ను
కోరుకొన్న వాడనే
కొత్తవాడ కానులే॥

అడగండి మా నాన్న
గారిని మా యింట
ఆ పైన చూతాము
మీ ముద్దు ముచ్చట॥

అంతదాక ఆగలేను
కాలేజీ మానేసి
పార్కు లోకి రావే
ముద్దు ఇచ్చి పోవే॥

రాలుగాయ మాటలు చాలు చాలు
నీతోటి సరసాలకు ఒకకోటి దండాలు॥

## 37

రవ్వంటి చిన్నదాన్ని
నవ్వులే నాకు వెలలేని సొమ్ములు॥

పువ్వువంటి నామేను
ముట్టికుంటె కందిపోవు॥

నాకంటి చూపులలో దాగున్న సింగారం
నా వంటి బిగువులో నిండియున్న యౌవనం
పడుచు వారి గుండెల్లో ప్రవహించు రక్తాన్ని
సలసల మనిపించు ఉరకలు వేయించు॥

గొంతెత్తి నే పాడ కోకిలలు ఆగి చూచు
సప్త సుస్వరాలు ఝురుల వలె ఉప్పొంగి
నలుదిశల పరువు లెత్తు నా నోటి మాట
ముత్యాల మూట వెదురు గోల పాట॥

ఊరించి ఊరించి అందాలు పంచే
నేర్పున్న దానను నెరజాణను
మరుని ఇల్లాలికైన నన్ను చూడ ఈసు పుట్టు
మాయిల్లె ఎనలేని కళలకు ఆటపట్టు॥

అందరికీ నేనూ అందేదాన్ని కాను
మనసెరిగి నాతోడ మసలుకొనే నేర్పున్న
మహరాజుకే నేను దక్కుతాను
మనసులోన అతనికే చోటిస్తాను॥

## 38

ఎవరో పాడారు తీయగా
ఎవరో పాడారు హాయిగా
ఎవరో పాడారు॥

ఎన్నడో నేను విన్న కంఠమది
ఎంత తీయగా ఉన్నదది॥

ఏరాగమో అది నే పోల్చలేను
ఆ స్వరము నామేను పులకింప జేసె
ఏ తాళమో అది నే నెరుగ జాల
నా గుండె దరుల కదలించి వేసె॥

అది ఒక జవ్వని గొంతని పోల్చితి
ఆమె గుండెల్లో పొంగిన రసధుని
పరువులు తీసె రీతిని వింటి
ఆమె కోసమై నే వెదకు చుంటి॥

ఉప్పొంగి పోయి ఆమె పాడే
రాగ మదేమీ కళ్యాణి యా
కాదు కాదది సెలయేటి జాలై
పొరలు చున్నదది మోహనయే॥

ఏమి ఆమె తన ఒంటరి తనమును
తెలుపు చున్నదా ఏదో విషాద
స్వనము నాకు వినిపించుచున్నదది
భైరవియా అది శివరంజనియా॥

ఆమెరాగమే ఒక యోగముగా
గిరులు తరులు పులకింప
నటియించుచు వినిపించుచున్నది
అది నిజముగ ఆనందభైరవే॥

# 39

శ్రీవారికి ఏమని ప్రేమలేఖ వ్రాయను
చిలకమ్మా చెప్పవే సిగ్గు వీడి॥

పూవులార చెప్పరే నా ప్రియునకు నేను
మనసు విప్పి వ్రాయ దగిన మాటలు మీరు॥

అన్నమన్నమాట నే మరచితిని
దానిపైన నాకు హితవు తప్పిన దెపుడో
నాలోని అనురాగం ఒక క్షణమైనా
నన్ను నిల్వనీయదు ఒంటరిగా ఒకచోట॥

నా కంటి రెప్పలు నీ కొరకై ఎదురు చూచు
నాలోని ప్రతి అణువు నీ తలపుతొ పులకించు
వెన్నెల నడిరేయిలో ఈ తోటలో నేను
ఉన్నప్పుడు నా వెంట నీ ఉంటి వనిపించు॥

నీవు వచ్చు రోజుకై నే ఎదురు చూతును
గడచిన ప్రతి నిముషమును నే లెక్కింతు
కలనైనా నిను చూడగ నే కోరుదు
కలుగదే అంతటి భాగ్యము నాకు॥

నాకన్నా నీకు ఆ చదువు గొప్పదా
నా కన్నా నీకు ఆ ధనమే మిన్నా
నన్ను చేర బిర బిర మని రారా ప్రియా
నీ గుండెల పైన నే కరిగి పోవ॥

నీ కొరకై నేను వేసవి దాకా
ఆశతోడ ఎదురు చూతు అపుడైనా నీవు
రాకయున్న తెలుసుకో మాటలు వేయేలా
ఇదే నా కడసారి ప్రేమలేఖ॥

## 40

పెను గాలి తాకిడికి
కొడి గట్టిన ఈ దీపం
ఏనాడు ఆరునో
ఈ వెతలూ తీరునో॥

మనసు విరిగిన నావారు
నను దూరం చేశారు
మనిషిని కానని మమతను వీడి
క్రోధంతో వెలివేశారు॥

ఎగిరితిని ఒకనాడు
గగనాన గాలి పటమై
ఎంత దూరమో పోయితిని
తెగిన దారమును కననైతి॥

పంట చేను తెగ పండిన నాడు
పిట్టలెల్లను చేరాయి
పచ్చ పచ్చని నా సోయగము
అందరి కనులకు విందానాడు॥

నడి సంద్రములో దారి గానక
సుడి గుండములో చిక్కితిని
పెను తుపానులో మునిగిన పడవ
దరికి చేరునా ఈనాడు॥

నలిగి పోయిన పూల గుత్తిని
కాలి పోయిన గంధపు చెక్కను
మండి పోయిన కర్పూరాన్ని
అయినాను నేను ఈనాడు॥

మరల జన్మ అది ఉన్నదా లేదా
ఉండి ఉన్న ఆ దేవుడు దయతో
నన్నొక రాతిని చేసిన చాలు
అదియే నాదు జన్మకు మేలు॥

## 41

తెలుగింటి పడుచుకు తీరని సిగ్గు
పైట జారనీయదు పక్కచూపు చూడదు॥

బుగ్గలపై గులాబీలు పూచినవని ఎరుగదు
కన్నులలో వెన్నెలలు జాలువార నీదు॥

సిగలోన తురుముకొన్న మల్లెపూల మాలలు
జారి జారి నేలపై రాలినవని ఎరుగదు
అడుగులు తడబాటుతో అంచరీతి నడిచెనని
తెలిసికొన జాలదు తెంపరి తనమే లేదు॥

బరువైన శ్రోణితో భారమైన ఉరముతో
సన్నానైన నెన్నడుమును సరిగా కదలించుచు
ఎదలోన మెదిలేటి మధురమైన భావాలను
తనలోన దాచుకొని దాగుడుమూత లాడును॥

ప్రేమించుట చేతకాదు పెద్దవారు చూచి
ముచ్చటగా మూడు ముళ్ళు వేయించు కోమంటే
గంగిరెద్దు వోలె పెండ్లి కూతు రవుతుంది.
గదిలోన ఆనాడు చెలరేగి పోతుంది॥

## 42

ఆడవె అందాల సురలోక భామిని
అఖిల లోకములు పరవశించగా॥

పాడవె గళమెత్తి ఒక దివ్యరాగం
భావాలు నాలో పల్లవించగా॥

పొంగిన గంగా నది తరంగములు
పొరలి పొరలి దరి చేరు నట్లుగా
నింగి కెగయు గోదావరీ నది
నిండు వేగమున కదలినట్లుగా॥

వర్షఋతువులో కృష్ణవేణి తన
వయసు పొంగుతో ఉరకలు వేయుచు
జాలువారు తన నీటి కెరటములు
గట్లనంటి ప్రవహించు నట్లుగా॥

మేఘ పంక్తిలో దాగిన క్రొక్కారు
మెరుపు తీగెల తళతళ చూచుచు
కురిసే వర్షపు ధారల లోన
పరవశించు ఆ ప్రకృతి కన్యవలె॥

ఘటము పైన నిక్వాణము చెలగగ
మర్దళమే గమకించి పల్కగా
కాలి యందియలు ఘల్లని మ్రోయ
కదలి రావె నా ఎద ఝల్లనగా॥

# 43

కొత్త పెండ్లికూతురి ముస్తాబును చూడగా
వెలదులార మీరంతా వేగమె రండీ॥

చిత్తరువును బోలిన ఆ పుత్తడి బొమ్మకు
కూర్చారు ఎన్నెన్నో వింత శోభలు॥

నుదుట బాషికము గట్టి కళ్యాణపు బొట్టుబెట్టి
నీటుగా బుగ్గపై కాటుక పెట్టారు
అర విరిసిన కనుల కొనల కాటుకను దిద్దీ
అందముగా కాళ్ళకు పారాణి పెట్టారు॥

సరిగంచు తెల్లచీరె చక్కగ కట్టారు
సంపంగి పూవులను జడలో బెట్టారు
అరచేతుల గోరంట ఆకు తోడ
అందమైన చిత్రాలను విరచించారు॥

బంగారు నగలతో మేనెల్ల నింపారు
ముత్యాల ముక్కుపుడక అమరికగా నుంచారు
వజ్రాల కమ్మలతో చెవులను సింగారించి
చెక్కిళ్ళ నొకసారి ముద్దుగా చూచారు॥

ఎవరే నిను కోరుకున్న సుందరాంగుడు
ఎవరే ని మనసును దోచిన వాడు
అని చెలులు దరిచేరి వరసాడుచున్నారు.
ఆ వేడుక చూడగా వేగమె రారండి॥

## 44

ప్రతి యింటిలోన వెలిగే ఈ దీపాలు
దేవాది దేవుని ప్రతిరూపాలు॥

ఈ పండుగ దీపావళి మన అందరి గుండెలలో
వెలిగించును దివ్యమైన ఆశా జ్యోతులు॥

అహంకార మజ్ఞానం గుండెలలో నిండిన
రక్కసుల శిక్షణకు ఇది సంకేతం
అహరహము శ్రమియించే కష్ట జీవుల
అనురాగం ఆత్మీయత కిది సూచకం॥

వెన్నెల కన్నా మిన్నగ వెలిగే ఆ మతాబులు
ఎగసి ఎగసి మిన్నంటే చిచ్చుబుడ్డి పూవులు
మనిషి మనిషి మధ్య నున్న ఆప్యాయత తెలుపును
మానవతే ధర్మమని పదే పదే చాటును॥

ఢాం అంటు నలుదిక్కుల పేలు టపాకాయలు
బ్రహ్మాండం పగలగొట్టు ఆటంబాంబులు
ఏనాడైన తమలోని శక్తి చూపుతాయి
హింసావాదుల గుండెలు చీల్చి మించుతాయి॥

ఆకాశంలో ఎగిరే తారాజువ్వలు
అద్భుతంగా తిరిగే విష్ణుచక్రాలు
అవె మానవ ప్రగతిని సూచిస్తాయి
అభ్యుదయపు బాటలను నిర్మిస్తాయి॥

## 45

తెలుగు వాడు మా వాడు
తెలుగు భాష మా భాష
తెలుగు దేశమే మా కన్నతల్లి
అదియే మాకు కల్పవల్లి॥

కృష్ణానది గోదావరీ నది
ఉరుకుల పరుగుల పొంగి పొరలగ
బంగారు పంటల పండించే
మా కన్నతల్లియె మాకన్న పూర్ణ॥

నన్నయ తిక్కన ఎఱ్ఱన వ్రాసిన
భారతమే మా సంస్కృతి మూలం
పోతన శ్రీనాధ కవి వరేణ్యులు
వ్రాసిన మాటలె బంగారు మూటలు॥

భువన విజయమున కృష్ణరాయలు
అష్టదిగ్గజాలందరు కూడి
విరచించిన ఆ గ్రంథములే
విలసితమైన వేద ఋక్కులు॥

అన్నమయ్య త్యాగయ్య తీర్థులు
రామదాసు క్షేత్రయ్య వ్రాసిన
ఆపదములె మా కమృత సమములు
అవియే మాకు ముక్తికి పథములు॥

కందుకూరి వీరేశలింగము
చూపిన బాటే మా బాట
కొసరి కొసరి గురజాడ పలికిన
తీయని మాటలె ముత్యాల సరములు॥

కనుల పండువుగ మా వారెల్లరు
చూచి తరించే ఆ కూచిపూడి
నృత్యమె మాకు ఆరవ ప్రాణం
అదియే ఆనంద సోపానం॥

అడుగడు గడుగోడో ఖడ్గ తిక్కన
అడు గడు గడుగో బాలచంద్రుడు
అడు గడు గడుగో తాంద్ర పాపయ
అట్టి వీరులే మా సోదరులు॥

కాకతీయ సామ్రాజ్య రక్షణకు
కదన రంగమున దుమికి వైరుల
నురుమాడిన ఆ మహిళారత్నము
రుద్రమ దేవి అదిగో॥

పరాయి వారల పరిపాలనను
అంతము సేయగ పుట్టిన యట్టి
అల్లూరి సీతారామ రా
జడుగో అడుగో అడుగో॥

తుపాకి గుండ్లకు గుండెను చూపిన
టంగుటూరి అడుగో
పట్టుబట్టి మన రాష్ట్రము దెచ్చిన
గట్టివాడు శ్రీ రాములు అడుగో

పదిమందికినీ మేలు చేయగా
పదండి ముందుకు పదండి తోసుక
అని చెప్పిన ఆ శ్రీశ్రీ యే
ఆదర్శం మాకేనాడు॥

## 46

మట్టితోడ చేసిన ఈ బొమ్మకు
మనసిచ్చి గమ్మత్తు చేశాడు దేవుడు॥

పుట్టీ పుట్టక ముందే ప్రతి అణువులోన
పెరిగింది స్వార్థము పెద్ద పెట్టున॥

తల్లియని తండ్రియని అనుబంధం పెరిగింది
తనవారని పెరవారని భేదం తెలిసింది
తన స్వొంతం ఈ లోకం అనిపించింది
తడబడే అడుగులతో ముందుకు నడిచాడు॥

ఇల్లనీ వాకిలనీ ఇల్లాలనీ
ఆశలతో ఎన్నెన్నో కల్పించుకున్నాడు
తనమాట వేదంగా చెలామణీ కావాలనీ
తపనతో మానవుడు ముందడుగు వేశాడు॥

ఉండేది మూణ్ణాళ్ళని అనుకోడు ఏనాడు
తనవెంట ఎవ్వరూ రారని తెలిసికోడు
అంతా తన సొంతమే కావాలని ఆశతో
పరుగులు తీశాడు పట్టు తప్పి పడ్డాడు॥

ఆరని తీరని ఆశల సారాన్ని చవిచూచి
పలురంగుల కలలతో పవలూ రేయీ గడిపి
మండే మంటల చితిలో తపనలన్ని వీడి
కడకు మట్టిలోన కలిసి పోయినాడు॥

## 47

తెలిసిన వారికి ఈ లోకమే ఒక
దేవుని సుందర మందిరము॥

ఎరిగిన వారికి ఈ విశ్వమే ఒక
ఉన్నతమైన విద్యాలయము॥

సూర్యుడు చంద్రుడు తరులూ గిరులూ
నదులూ నిధులూ ప్రాణికోటులు
సృష్టించిన ఆ పరమాత్మ అన్నిట
చూచిన వారికి కాన నగు॥

మనిషికి మనిషికి మధ్యన ఉన్న
అనుబంధ మెరుగుట అదియే విద్య
అణువుకు అణువుకు మధ్యన ఉన్న
ఆ బంధ మెరుగుటయే విజ్ఞానం॥

అగణితమైన గణిత మెనర్చి
ఇంత విశ్వమును విరచించీ
అందరి ఆలన పాలన చూచే
ఆ పరమాత్మను ఎఱుగుటె జ్ఞానం॥

అన్నిటి కన్నా ముఖ్యమైనది
మనిషికి లోక జ్ఞానం
అది లేనివాడు దుఃఖాల పాలగు
అతడు డుబ్బుకు కొరగాడు॥

-8

## 48

కర్షకులం కష్టజీవులం
మా శ్రమశక్తియే మీ కాధారం॥

సైనికులం వీరయోధులం
మాతుపాకులే మీకు రక్షణ॥

ఎండనక వాననక
హలాల తోడ పొలాల దున్ని
బంగారు పంటల పండిస్తాము
ప్రజలకు అన్నం మేం పెడతాము॥

రేయనక పగలనక
గిరులనకా తరులనక
మంచనకా మంటలనక
ఈ ధరిత్రినీ కాపాడుతాము॥

మేమే కష్టం చేయకుంటే
మేమే పంటల పండించకుంటే
మే మన్నాన్ని మీకిడకుంటే
మీ శక్తి సున్న తెలియర అన్నా॥

పరాయివారల పన్నాగాలను
దేశంలోని విప్లవ జ్వాలను
మేమే రూపు మాపక ఉంటే
మీ ప్రాణాలే లేవన్నా॥

(అప్పుడు భరతమాత వచ్చింది)

మీరందరు నా కన్న బిడ్డలే
మీరే నాకు ఆధారం
ఒకరి కొకరుగా మెలగాలి
అదియే మనకు శ్రీరామరక్ష॥

జై జవాన్ జై కిసాన్
జై కిసాన్ జై జవాన్
జై జవాన్ జై కిసాన్

## 49

ఎవరిచ్చారే నీకు ఈ తీయని గొంతుక
కమ్మగా గళమెత్తి పాడేవు గీతికా॥

మావి చివురులో నున్న మాధుర్యమా ఇది
కాదు కాదు అది నీదు జన్మాంతర సంస్కృతి॥

మధుమాసపు వేళలో నీపాట కచ్చేరి
విని మురియని వాడు ఈధరపై లేడు
ఇంతటి స్వరజ్ఞానము నీ కెవరిచ్చారే
ఆ గురువు పేరేమో ముచ్చటగా చెప్పవే॥

విరహిణుల దరిచేరి కరుణ రసము పొంగి పొరల
పాడేవు ఎంతో బాధతో విషాద గీతి
నీలోని ఆత్మీయత వారికేమి తెలుసును
నిను చూచి వారు పెను వగలో మునిగేరు॥

మరల వారు ప్రియుని దరికి చేరినంతనే
నీ కంఠము నుండీ వెలువడే ఆ రవము
అమరలోక గానమై హాయిగా వినిపించు
అది ఏమి చిత్రమే అది ఏమీ గాత్రమే॥

ఉల్లములో నీవు నీ ఆకృతినీ తలచుకోవు
నల్లగా ఉన్నావని దిగులు చెందవు
ఎంతటిధైర్యమే ఓ కోకిలా
నీవే పదిమందికీ మార్గదర్శివి॥

# 50

మాకెందుకు అచ్చరాలు రానే రావో
అది మీకు తెలియదు ఈ సత్తెమింతే॥

అడుగున బడి ఉన్నాము అడవిలో ఉన్నాము
కాలం పాదాల కింద నలిగిపోయి ఉన్నాము॥

మాదిగని మాలని మా వారిని దూరంగా
ఎంతో కాలం మీరు ఉండమని అన్నారు
మీరు నేర్చుకున్న సదువులోని ఒక్కముక్కైనా
మా చెవిన పడకుండా సెద్ద తీసుకున్నారు॥

మంచీ చెడు తెలియక మా వారలు సారాయి
కల్లూ బట్టీ పెట్టి గనముగా తాగారు
బత్తెలను గొత్తెలను కోసుకొని తిన్నారు
పదును బెట్టి తోళ్ళతో పని చేసుకున్నారు॥

దేవుడి గుడిలోనికి రావద్దని అన్నారు
బడిలోన ఎడమగా కూకుండ మన్నారు
ఆ రీతిగ మా పెద్దలు దూరంగా ఉన్నారు
అందుకే మేము అగ్యానంలో ఉన్నాం॥

సాతంత్రం వచ్చినాక ఓటు అక్కు వచ్చింది
అందరితో పాటే మాకు బడీ అన్నారు
ఆనాటి నుండీ అచ్చరాలు కొంచెము
మాకు కూడ వచ్చాయి మా తెలివి హెచ్చింది॥

ఈ దేశంలో నున్న పెద్దలందరూ
ప్రతి పల్లెలోన ఒక బడిని పెట్టి
అచ్చరాల దివ్వెను వెలగించాలి
ఆ వెలుగులోన మమ్మల దీవించాలి॥

## 51

స్వతంత్ర భారత దేశంలో
జరిగే స్వర్ణోత్సవ సమయంలో
ఒక్కసారి గుడి తలుపులు తెరచి
జేగంటల మ్రోగించండి
దివ్య జ్యోతుల వెలిగించండి॥

హిందువులారా క్రైస్తవులారా
మహమ్మదీయులారా
అందరమూ భారతీయులం
ఈ దేశానికి వారసులం
ఈ సత్యాన్ని గుర్తుంచుకొని
అందరు ముందుకు రారండి॥

ఉన్న తీరును గమనించండి
ప్రగతి బాటలను నిర్మించండి
మనిషిలోపల మానవత్వము
పెరిగే మార్గం చూడండి॥

అమ్మలార రారండి
బాబులార రారండి
బాలకులారా రారండి
బాలికలారా రారండి
భారతదేశపు పౌరులు మీరు
భరత మాతకు బిడ్డలు మీరు॥

గంగా గోదావరి వలె పారే
కల్లూ సారా నీటికి
అడ్డు కట్టలను వేయండి
అందరి దుఃఖం తీర్చండి॥

త్రాగే కొడుకును నిరసించండి
త్రాగే మగనిని విడనాడండి
త్రాగే తండ్రికి దూరంగా
తరలండీ పెరగండీ॥

అమ్మే అంగడి వానికి
ఆత్మ లేక పోవచ్చును గాక
పర్మిట్లిచ్చే రాష్ట్ర నేతలు
కన్ను తెరవరేమి తెరచి చూడరేమీ॥

ఆడ మనిషిని అంగడి బొమ్మగ
వస్త్రహీనగా చిత్రించేటి
చలనచిత్రముల నిరసించండీ
చైతన్యమును పెంచండీ॥

కూటికి లేక గుడ్డకు లేక
సాలె గూడులో చిక్కుకొని
ఏదో ఒక మగపశువు చేతిలో
మానము కోల్పడి వెలందులై
మ్రగ్గే తల్లుల రక్షించండి
మానవత్వమును నిలపండి॥

అట్టి అంగడులు పెట్టినవారిని
అట్టివారిని తార్చే వారిని
ఛూ అని మొగాన ఉమ్మండి ఆ
ద్రోహులను శిక్షించండి॥

దొంగతనాలను దోపిడీలను
చేసేవారిని సరిచేయండి
దేశంలోన పడిన దొంగలను
ఓటు హక్కుతో వెలివేయండి॥

అవి నీతిని విడనాడండి
హింసను చేయుట మానండి
అభ్యుదయంకై ప్రగతి మార్గమున
అడుగులు ముందుకు వేయండీ
దేశంలోని అన్ని దిశలలో
ఆశల దీపాల్వెలిగించండి॥

## 52

నీకు నీవు సాయం చేసుకో తమ్ముడు
నీ ధ్యేయం ఏమిటో తెలుసుకో తమ్ముడు॥

అక్షరాలు రాకుండా ఈ లోకాన్ని
అర్థం చేసుకొని జీవించుట కష్టము
ఆ జ్ఞానం నీకు కలిగిన నాడే
ఆనంద మయమగును నీ జీవితం॥

శ్రమియించి ఏదో ఒక వృత్తి విద్య నేర్చుకో
పది మందికి పనికి వచ్చు పనిని చేయ పూనుకో
కండ బలము గుండె బలము నిండుగా పెంచుకో
ఆనాడే దేవుడు నిను ఆదుకొనును తెలుసుకో॥

జీవితమను సంద్రాన ఎన్నో సుడి గుండాలు
చుక్కాని చూచుకొని సూటిగా నడుచుకో
కెరటాల తాకిడికి గుండె దిటవు చేసుకో
తెరచాపను పైకెత్తి పడవను దరి చేర్చుకో॥

అన్యాయము నీకు పరులు చేసినారని
అహరహము దానితో కుమిలి పోకు
అన్యాయము చేసిన వారి అంతు చూడగా
నిను నీవు కాచుకో నీ శక్తిని చూచుకో॥

కాలం దైవం ఎపుడో సంఘటిత మవుతాయి
ఎనలేని అపకారం నీకు చేసిన
వారి గుండె కండలకు యమపాశం వేస్తాయి
నీ చేతికి దానినిచ్చి ఆడిస్తాయి॥

రగిలిపోకు కుమిలి పోకు రాతిరెన్నడుండదు
తెల తెలమని తెలవారును దివ్యదీధితుల తోడ
అరదమెక్కి భాస్కరుడు అడుగు ముందుకేస్తాడు
ఆ వెలుగులోన విజయం నీకిస్తాడు।

## 53

అందాల భామను నృత్యం నేర్చిన దానను
అమర లోకపు నాట్యకత్తెలకు తీసిపోని నెరజాణను॥

ఘనాఘనావళి చూచి మురిసే వనమయూరి కన్నా
ఆడేను నాట్యాన్ని ఎంతో మిన్నగా॥

విస్కీ బ్రాందీ సారాలో ఏముందీ ఏముందీ
నా కన్నులలో ఉన్న నిషా ఈ జగానికి ఒక్క తమాషా॥

ఈ రూపు ఈ చూపు ఈ శిల్పం ఇవి అనల్పం
మదన కదనమున నాతో కూడిన మనిషికి వచ్చును దివ్యత్వం॥

అధరాల ఏముందో పయోధరాల ఏముందో
అంతకన్నను నాదు నాభిలో ఉన్నలోతులో ఏముందో
ఆ అందాన్ని ఒక్కసారి తనవి తీరగా చూచుకో
ఆరని తీరని కామ దాహమును ఆర్చుకో తీర్చుకో॥

ఈ లోకంలో రేపు లేదు ఈనాడే నీకున్నది
పొంగే అలలు పోయిన తదుపరి సముద్రమందలి శోభేమీ
పున్నమి రాతిరి గడిచిన వెనుక చందమామ సొగసేమీ
ముట్టర నన్ను పట్టర పట్టు ముద్దుల తోడ నను ముంచి
ఒక్కసారి నీవెక్కి చూడరా కనిపించును కైలాసపు మెట్టు॥

## 54

ఏదీ ఒకసారి నవ్వు ఏదీ ఒకసారి నవ్వు॥

నీ నవ్వే నాకు కోటి దీప కాంతులుగా॥

మధుమాసపు వేళలో మల్లెలు విరజాజులు
పూచినట్లుగా కోకిల కూసినట్లుగా॥

శరదృతువులో పున్నమి రాతిరిలోన
చందమామ వెన్నెల స్రవియించినటుల
మంచుకొండ కరిగినటుల తెలిమంచు కురిసి నటుల
కర్పూరం వెలిగి నటుల కమ్మగా నవ్వు॥

సిగ్గుతోడ విరబూచిన నీ బుగ్గలను
ముద్ద మందారాలుగ చేసినవ్వు
ముత్యాల దొంతరలు రాల నవ్వు
పొంగిన సెలయేరులా పొరలి నవ్వు॥

పరువెత్తే నది నీటి నురుగు రీతిగా
చిరుగాలికి గలగల మను మావి కొమ్మలా
వాన ఆగిపోయినంత సిగతడిని తుడుచుకొని
హరివిల్లును చీరెగా ధరియంచిన గగనంలా॥

ఆకసాన తారకలు చందమామ దరిచేరి
పరవశించి వలపుగీతి పాడినట్లుగా
గాలి అలల తాకిడికి పులకించిన వెదురుగోల
ఈల పాట కమ్మగా వినిపించి నటుల॥

నీ నవ్వే నాకు మధుర సుధా వీచిక
నీ నవ్వే నాకు రతనాల పేటిక
నీ నవ్వే నాకు ఒక చక్కని కానుక
నీ నవ్వే నాకు జీవితాన వేడుక॥

## 55

ఏ రీతి భరియింతు ఈ విరహము॥

ఏగతి నే భరియింతు ఈ సరసము॥

చందమామ కన్నా ముద్దైన మోముపై
ఒకసారి నేను ముద్దుపెట్టనా॥

రాతిరనీ కానీ చీకటినీ రానీ
అంత తొందరైతే చులకన కామా॥

తలుపులన్ని మూసి చీకటినే చేయనా
నీలి దోమ తెరలోన నీ మోమును చూడనా
వలిపమైన వస్త్రాల సవరించి నీలోని
వంపులను చూడనా నే పరవశించనా॥

ఆగడాలు చాలు చాలు రాగము తాలూకూ
ఆరోహణ అవరోహణ ఎఱుగుట మంచిది
అవి తెలియకుండా సాపసా అంటే
మీ పస అయిపోవును రాగము శృతి తప్పును॥

ఆగలేను నాలోని ఈ పొగలు నన్ను
నిలువ నీయకున్నవి నేనేమీ సేతు
ఒకసారి నిన్ను బిగియార కౌగిలించి
వేడి వేడి ముద్దు ఒకటైనా పెట్టనా॥

పట్ట పగలు నా సిగలో జాజాలను ముట్టకు
సంపెంగలు తాకకు సౌరు వాడి పోనీకు
రాత్రైన వెంటనే వస్తాను పాన్పుకు
అప్పుడు చూపించండి మీలోని గొప్పతనము॥

## 56

చూడర నా సొగసు
చూడర నా వయసు లోనున్న జిగిబిగి
వెన్నెల బొమ్మను వెలలేని దానను॥

చూడర నా తీరు
చూడర నా మేని అందచందముల
అపరంజి బొమ్మను నీ యిల్లాలిని॥

నే జాణనురా నా చూపులతో
సుమశరునైనా బంధింప నేర్తు
నా తోడ రతుల పెనగిన మరుడు
రతినైన కన్నెత్తి చూడకోరడు॥

మమకారములో మాధుర్యమున్నది
అది తేనె కన్నా తీయనిదీ
అనురాగములో అంచులు చూపి
గృహసీమ సురసీమ గావింప నేర్తు॥

నెమలికి నృత్యము నేర్పిన గురువును
నదులకు నడకలు నే నేర్పితిని
కదిలియాడు నవ నీరదములు నను
చూచి నేర్చెను మందగమనములు॥

చేతిలోని నా వీణ ముద్దుగా
పలుకును తీయని సరిగమల
కదిలినంతనే ఎన్నో కృతులను
కమ్మగ పాడును జగమే ఊగ॥

హొయలూ లయలూ నా సొంతం।
ఓరిమి కూరిమి నా రూపం।
శృంగారమె నా ఆకారం।
సిగ్గభిమానమె నా సంపద।

పొద్దు తిరుగుడు పూవును నేను।
పూచిన సంపెంగను నేను।
మల్లెను నేను జాజిని నేను।
పూవుల లోని తావిని నేను॥

ఇంటి గోడల మధ్యన మ్రగ్గే
ఇంతికి సరసం ఏమి తెలియును
రస విహీనముగ మసలే స్త్రీకి
రతిలో రమ్యత ఏమి తెలియును॥

పదిమందికినీ తన శరీరమును
పంచి యిచ్చు వెలయాలి ఆకృతికి
మురిసే వాడికి ముందు తెలియును
ఆ భోగంలో ఆరని సెగలు॥

## 57

అడుగులో అడుగు వేసి నా వెంట రాకు॥

చూపులో చూపు కలిపి నను చూడకు॥

లోకమెల్ల మనల చూచి లోలోన ఏవేవో
గుస గుసలు పోతుంది కొంటె మాటలంటుంది
ఒట్టొట్టి మాటలతో మన పరువు పోతుంది
ఆపైన నీకు నాకు రగడవు తుంది॥

పదిమందికి ఈ జంట చూడముచ్చటౌతుంది
బాగున్నది ఒకరికొకరు ఈడు జోడు అంటుంది
ఆపైన మన పెద్దలు పెద్దరికం నెరపి
మూడు ముళ్ళు వేయించి ముచ్చట తీర్చేరు॥

అంతదాక ఆగండి ఇంత తొందరెందుకు
వలపుల గుఱ్ఱానికి కళ్ళాలు వేయండి
భావనా వాహినినీ పొంగి పొరలి పోనీక
ఆ ప్రొద్దు వచ్చు వరకు ముద్దుగా ఆగండి॥

ముందు వెనక చూచిన నాలోని మోహము
దాహము వలె నన్ను వేధించు చున్నది
ఒకసారి నీ మోవి సుధనాన నీవె
ఆపైన చూతాము తరువాత మాట॥

అబ్బో ఎంతాశ అబ్బాయి గారికి
కాకెంగిలి చేసి రుచిచూడ కోరికా
తెలుసుకొని మసలుకో నాలోని అభిమానం
తెలుగింటి పడతికి మానమే ప్రాణం॥

ఏనాటికైనా నీవు నా దానవే
ఈ లోక మెల్లా ఏకమై అడ్డినా
నిను నేను పెండ్లి చేసుకొని తీరుతాను
నీ చెక్కిలిపై ముద్దుల వర్షం కురిపిస్తాను॥

## 58

ఈ ముద్ద బంతి పువ్వు ఎంత ముద్దరాలో
ఒళ్ళంతా సిగ్గే మాటాడదేమి॥

తొలిరాతిరి గగనసీమ తలుపు తెరచి వచ్చిన
ఈ దేవత నాపైన కరుణ చూపదేమి॥

నెటి కురుల మేఘాల మాటున దాగున్న
మోమునాకు చూపదేమి ముద్దీయదేమి॥

చక్కిలిగింతలు లేవా చక్కని చుక్కా నీకు
కదలవేమి శిల్పానివి కావు కదా నీవు॥

మీకేమి మీరు మగమహారాజులు
బోలెడంత ధైర్యాన్ని పోగుచేసుకున్నారు
హద్దుదాటి రాలేని అందాల భామను
తొలిరాతిరి తెరతీసే బాధ్యత మీదే॥

ముద్దరాలి సిగ్గే ముద్దయినది
అదే నాదు అందానికి అనువయినది॥

ఎంత తీయనైన మాట కోకిలలా పలికావు
వీణ తీగె రవళిలా ఎద కదిలించావు
మాట లేరాని చిలుకవని అనుకొంటి
కదలీ కదలగ లేని రాయంచ వనుకొంటి
ఈ ముద్దబంతి పూవు ఎంత ముద్దరాలో
వళ్ళంతా సిగ్గే అనుకుంటి నేను॥

ఆ చిలుకలు నాకు చెలికత్తెలే
అంచలెల్ల మా యింటి పంచన ఉండేవి
ఇంతదాక వాటెతో మాటాడి ఆడిపాడి
వచ్చాను ఇచ్చటికి వలపుల రేరాణిని॥

ఏదీ నీ ఎదపైన ఒక్క ముద్దు పెట్టనీ
బిగి కౌగిలిలోన నిన్ను బంధించనీ
అధర సుధల నాననీ ఆపైన తమిమీర
ఒళ్ళెల్ల ఒకసారి ముట్టి చూడనీ॥

ఈ పాలు త్రాగండి చల్లారక ముందే
వాటిలో సగము నా పాలుగా ఉంచండి
ఏవైనా తీయని కబురులు చెప్పండి
అంత తొందరేల మీకు అసమశరుని కేళికి॥

## 59

అదె యమునా నది పులినతలం
అదె గోపాలుని వేణు గానము॥

తలలాడించి పులకించి పోయె
తరువులు గోవులు అవే అవే॥

శారద నీరద పంక్తుల నుండీ
వెలికి వచ్చి తన కరముల తోడ
కలువ కన్నెలను కౌగిలిచేర్చి
ముద్దాడు రేరాజు అతడే అతడే॥

కాలి యందియలు ఘల్లున మ్రోయ
అరమోడ్చిన తన కన్నులలో
వలపు దెలుపుచూ మాధవురాకను
కోరి నటించే రాధిక అదుగో॥

ప్రతి భామినితో చేతులు కలుపుచు
ప్రకృతి ఎల్ల పులకించి పోవగా
జగమే ఊగగ రాచ కేళిలో
పరుగులు తీసే శ్రీహరి యతడే॥

అమర గానమిది అమర నాట్యమిది
అదియే అద్భుతమైన ప్రకృతి
పురుష సంగమము భువనమోహనము
అదియే జగదానంద కరం॥

## 60

ఎప్పుడో ఒకనాడు పోవాల్సిందే
ఎన్నడో ఒకానాడు చావాల్సిందే॥

నిత్యమూ బతికి చచ్చు ఈ జీవితం కంటే
మనకు హాని చేయువారి చంపి చావటం మేలు॥

మనచేత పవలు రేయి వెట్టిపని చేయించి
కూడు గుడ్డ యివ్వనట్టి దొరబాబుల
గుండెల్ను గునపాలతో కూల కొడదాము
కండల్ను కాకులకు గద్దలకు వేదాము॥

మనము పండించిన ధాన్యాన్ని తన చక్ర
వడ్డీల కిందికి సరిచూసి జమకట్టి
మన రక్తధారల పరమాన్నం రీతిగా
తాగేటి వారల తలలు తరగ రారండి॥

అయిదేళ్ళ కొకసారి ఓటు అడుగ వస్తారు
మనము మనము అంటూ మాటలు చెబుతారు
కులమంటు మతమంటు గోముగా చూస్తారు
గద్దె ఎక్కినాక మన ముఖం చూడరు
అట్టివారి జులుము నశియంప చేయగా
అట్టివారి అవినీతి అంతమొందించగా
కదలి రండి కడలిలోని కెరటాల దండుగా
కదలి రండి కండ్లలోన అగ్నిశిఖలు నిండగా॥

పోలీసు లొక పక్క నక్సలైట్లు ఒకపక్క
టెర్రరిస్టులొక పక్క సైనికులు ఒకపక్క
తన్నుకుంటు గుద్దుకుంటు తప్పటడుగులేస్తుంటె
దాని అణచగా లేని మన పెద్దల
పాలన లో మనకు శాంతి ఏమూలనుంది
బతుకులోన మనకు సంతోషమేముంది॥

ఈ దేశమందున ఎందరో బుద్ధులు
గాంధీలు పుట్టారు కాలంలో కలిశారు
శాంతి శాంతి యన్నారు చట్టాన్ని చేతిలోకి
తీసుకోవద్దని తెలియజెప్పి పోయారు
మళ్ళీ ఆ రోజులు ఏనాడు వస్తయో
అంతదాక మనము వేచి చూడరాదు
ఆయుధాలు చేతబూని అడుగు ముందుకేయండి
మనకు మనమె రామరాజ్యం నిర్మించుకుందాము॥

## 61

నీతిలేని మనుషులకు పదవులు ఇస్తే
నిలబడుతుందా మన స్వాతంత్ర్యం॥

స్వార్థమే పరమార్థం అయిన వారికి
చట్టాన్ని చేతికిస్తే ప్రగతెక్కడిది॥

బడికి పోక ఎట్టులో పట్ట భద్రులై కాక
గుండాల గుంపుతో ఓట్లను దండుకొని
వెదజల్లిన రూకలకు వేయి రెట్లు పొందగా
పరుగెత్తే వారలూ పరిపాలిస్తారా॥

చదువుకున్న బాబులూ మాకెందుకు ఈ గొడవని
సంతోషంగా లెక్కలు కట్టుకుంటు కూర్చుంటే
ఏదో ఒకనాడు ఈ దేశాన్ని
అప్పు క్రింద జమకట్టే రోజొస్తుంది॥

పంటలను పండించి దేశాన్ని పోషించే
రైతులార ఇకనైనా మేలుకోండి
దేశానికి రైతే దిటవైన వెన్నెముక
అతని కష్టాలు ఫలమె ఈ జాతికి కానుక॥

కొలిమిలోన కండలను కరిగించి దేశానికి
పని ముట్లను అందించే శ్రామికులారా
ఇకనైనా ముందుకు సాగిరండి
ఈ దేశం అభ్యుదయం మీ చేతులలో ఉంది॥

యుద్ధ రంగమందున జాతి క్షేమమును కోరి
ప్రాణాలను అర్పించే వీరులారా
కదలిరండు ఇకనైనా ఈ దేశపు రక్షణకు
మీ అడుగులె భారతికి శ్రీరామ రక్ష॥

వస్తువులను పదిమందికి అమ్మకమ్ము జేసి
మీ మీ లాభాలతో దేశాన్ని నడిపింప
చూచే ఓ బాబులార ముందుకురండి
ఈ దేశపు పరిపాలన సరిదిద్దండి॥

జ్ఞానాన్ని తృష్ణతో ఆర్జించే యువకులార
శీలాన్ని రక్షించుకొనగోరు యువతులార
రండి కదలి రండి సింహోల్లా గర్జిస్తూ
మీరే ఈ భారతిని రక్షించ గలవారు
మీరే ఈ భారతికి భావిపౌరులు॥

నాయకులారా మీరు ఇకనైనా మేలుకోండి
అవినీతిని స్వార్థాన్ని దూరంగా విడువండి
లేకుంటే ఒకనాడు ఈ జాతి మేలుకొని
దిశలెల్ల దద్దరిల్ల గర్జిస్తుంది
దిగిపోండని మిమ్ములను శాసిస్తుంది॥

## 62

ఒకరిది కష్టం వేరొకరి దదృష్టం॥

ఒకరికి లేమి వేరొకరికి కలిమి
అదే జీవితం లోని నిత్య సత్యము॥

కష్టించి కాకమ్మ గూడు కట్టుకుంటుంది
కోకిలమ్మ తన గుడ్లను దానిలో నుంచుతుంది
చీమ లెల్ల కష్టించి పెట్టిన పెను పుట్టలో
పాముదూరి హాయిగా పవళిస్తుంది॥

అను నిత్యము కష్టించి పొలము లోన పనిజేసి
పంటలు పండించేది పేద రైతు
ఆ పంటల నమ్మి ధనము మూటగట్టి
కోటికి పడగెత్తేది గోలుమాలు వ్యాపారి॥

కాలము బాగున్నపుడు కలిసి వచ్చును
కాని నాడు అది త్రాచై కాటు వేయును
పూలమ్మిన చోటనే కట్టెలమ్ముటకునైనా
వీలు దొరకదదియే ఆ విధి వ్రాసిన వ్రాత॥

కష్టించిన వాని చెమటలో ధనముంది
కష్టించిన వానికి తృప్తి మిగులుతుంది
ఆదృష్టం అందరికీ అందని కొమ్మ
ఆ కొమ్మ పండ్లు అందకున్న పుల్లన॥

## 63

చెంగు చెంగంటు నాపైన దుముక బోకు
బంగారు లేడిలా పరుగెత్తి రాకు॥

ప్రేమించానంటే ఆ చూపు లేమిటి
వేటగాడిలా మిట్టి మిట్టీ చూస్తావు॥

ఆడవారి మాటలు నిజమని అనుకుంటె
అంత ఉత్తపూలు ఇంకొకడు ఉండడు
దగ్గరై సంపంగి మొగ్గలా ఉంటారు
దాని వెనుక త్రాచుపాము బుసకొట్టి పోతారు॥

అంత అనుభవమ్ము మీకు ఎచట నుండి వచ్చింది
ఆ రీతిగా మీకు ఎవరయిన చేయిచ్చి
తప్పుకున్నారా దాటుకున్నారా
విప్పి చెప్పండి దాపరిక మెందుకు॥

చదువుకున్నాను ఎన్నెన్నొ పుస్తకాలు
సాహిత్య మెల్ల కరతలామలకము
చక్కని కథలున్న సినిమాలు చూచాను
తెలుసుకున్నాను ఆడదాని నైజము॥

జీవితాలన్నీ పుస్తకాలు కావు
పుస్తకాలన్నీ జీవితాలు కావు
మనసిచ్చినట్టి మగువ ప్రాణమైనయిచ్చును
మగని తోడిదే లోకం అని వచ్చును॥

ఉద్యోగమా లేదు సద్యోగమా లేదు
ఉన్నవాణ్ణి ఎవణ్ణయిన చూచుకో మాతల్లి
ఉద్యోగం కోరి ఊరిలోన నేను
తిరుగుతున్నాను నీ కంట బడ్డాను॥

వన్నె చిన్నెలున్న దాన్ని వయసులోన ఉన్న దాన్ని
ధనమున్న దాన్ని గుణమున్న దాన్ని
నిన్నూ ప్రేమించాను మా నాన్నతో చెప్పి
మా కంపెనీకి నిన్ను ఎండీగ చేస్తాను॥

అంత చొరవ నీకుంటె అనుమానమెందుకు
నీకు తాళి కడతాను నిన్నేలు కుంటాను
అదృష్టమన్నది నా కాలు తొక్కింది
అందలం ఎక్కమంది సందేహమెందుకు॥

## 64

ఎదలోన నిన్నునే దాచుకోనా
పెదవులలో సుధనాని ఈలపాట పాడనా॥

వీలుచూచి వచ్చేను వేడుక లిప్పుడు చాలు
కమ్మనైన నా చేతి కాఫీని త్రాగండి॥

నిన్నరాత్రి కొంత మిగిలుందని తెలుసుకో
పున్నమి రేరాజు నా కనుల ముందె ఉన్నది
మరల నొక్కసారి మరుని కేళిలో గూడి
గువ్వల వలె దుప్పటిలో కూచుండి పోదామా॥

ముద్దులూ మురిపాలూ చాలించండి
పదిమందికి భాగవతం చూపించకండి
ముద్దరాలు కాదిది మొనగత్తె నెఱజాణ
అని నన్ను దూరుతారు మీ అమ్మగారు॥

ఆమె మాటకేమిలే అంటుంది ఏమేమొ
కొత్త మురిపెమింకా తీరనే లేదు
అత్తగారి పెత్తనమును ఆలోచనలోనికి
రానీకు రేరాణి నా అలివేణి॥

మీకేమి మీరు గొంతెత్తి పాడేరు
ముద్దుగా వీణపై వాయించేరు
అత్తగారు వాయించే ఆ మద్దెల దరువుకు
ఆగాలి నేను కొత్త కోడల్ని॥

చాలు చాలు గుసగుసలు సన్నాయి నొక్కులు
ఎగసి పడే ఈ గుండె ఏమంటుందో
ఒక్కసారి వినిపో ఈ సవ్వడి ఏమో
పదే పదే నీ స్మరణ వినిపించుట లేదా॥

తెల తెల్లవారింది ఆఫీసుకెళ్ళాలి
గడియార మప్పుడే ఎనిమిది కొట్టింది
మీ కొరకు టిఫెను నేను సిద్ధం చేయాలి
ఆపైన వంట చేసి కారియరందించాలి॥

అమ్మగారు ఉందిలే ఆపని చూస్తుందిలే
అయిదే నిమిషాలలో అన్ని అయిపోవునులే
నీ సిగలో పూవును నే వాడనీయనులే
మూడుపూలు కాయలారు కావాలి మన వలపు॥

ఇన్నాళ్ళ వలెకాదు ఆమె వంట చేయదు
గోరు ముద్దలను మీకు తినిపించబోదు
అంటారు అత్తగారు కొత్తకోడలు
కొంగుకు తన కొడుకునూ ముడివేసుకున్నదని॥

## 65

ఆడెను శివుడు తాండవము
అద్రి జాత పులకించి చూడగా॥

కాలి యందియలు ఘల్లని మ్రోయగ
కైలాస శిఖరము కదలి పోవగా॥

చెలువారు గంగ రంగదుత్తుంగ యై
శృంగారముతో పొంగి పోయి నవ
భంగిమలోన నాట్యము చేయుచు
నవ రసమ్ములను ప్రస్ఫుటించగా॥

కంఠములోని గరళపు శక్తిని
క్రిందు సేయగా శిరమున దాల్చిన
ఆ సుధాకరుని రేఖ ఊగగా
అది చూచి సురలు మురిసి పోవగా॥

ఓంకారము దశదిశల నినదింప
హుమ్మని నంది రంకెలు వేయ
జలధు లేడును కళవళ పడగా
చతుర్ముఖుడు భయమంది చూడగా॥

నమక చమకముల వేదనాదముల
నమో నమో హర జటాజూటయని
సురలు మునులు కీర్తించుచుండగా
సుందరి గిరిసుత లాస్యము సేయగ॥

ప్రమధ గణములు భళిభళి యనగా
రక్కసు లెల్లరు అక్కజమున చూడ
కంఠమందలి భుజగ హారములు
కదలి కదలి నాట్యమ్ము సేయగా॥

## 66

జయ జయ జననీ దుర్గా భవానీ
జయ కదంబ వనవాసిని గౌరీ॥

జయ కళ్యాణి మంగళ రూపిణి
జయము జయము దాక్షయణి శాంకరీ॥

సురలోక పావని సురుచిర రూపిణి
అభయ దాయినీ ఆశ్రితావనీ
మధుర లాస్య నర్తన వినోదినీ
మాంపాలయ గిరి రాజ నందినీ॥

సకల రాక్షస నాశన కారిణి
నిఖిల జనాభ్యుదయాను మోదిని
పరమేశ్వర అర్ధంగ భాసినీ
పాహి పాహి కైలాస విహారిణి॥

## 67

ఎంత చక్కని సవ్వడి
ఎవ్వరు నేర్పిరొ ఈ సంగీతం
లయబద్ధంగా శిరములపైన
రమ్యముగా నటియించుచున్నది॥

వింతగ కురిసే ఈ వాన
నెమ్మేను సోకిన పన్నీటి సోన
పులకించిన నామనసెల్ల
వలపుల లహరుల నిండుట కల్లా॥

నీ ఎదపైన కురిసిన చినుకులు
ఆయెను మంచి ముత్యములు
నీ అధరాలను తాకిన నీటి
బిందువు లాయెను పగడాలు॥

మన మనసులను ఆర్ద్రముచేసి
మన తనవులను దగ్గఱ చేసి
మనల నొకటిగా చేసిన ఈవాన
మనకెంత దగ్గరి నేస్తమో॥

వలపు పడవలను పూలతెప్పలను
నిర్మించ తలపులు పుట్టించు ఈ వాన
ఎదనెల్ల తడిపి మదిలోన ఏవో
కొత్త కోరికల నాటెను॥

దివినీ భువిని చక్కగ కలిపే
నీటి నిచ్చెనే ఈ వాన
గగన పటముపై ఇంద్ర ధనువును
రచియించు కుంచే ఈవాన॥

మరపురాని మధురాను భూతిని
కూర్చు అమృతమే ఈ వాన
మనల నిర్వురను ఆశీర్వదించ
దివిజులు కురిసిన సేసల వాన॥

## 68

రాతిరేళ ఒకసారి రామామా పోదాము
నడి సంద్రంలోన పడవలోన కూకోని॥

రాతిరేళ ఎక్కడికో పోవటము ఎందుకు
మన పొందులోని ఆనందం చాలదా॥

పున్నమి ఈ రోజు వెన్నెల ఆకాశంలో
నిండిపోయి నీటిలో పండిపోయినాది
ఆ వెలుగు పుంతలో మనము పడవ నడుపుకుంటూ
అద్దరికీ చేరుదాము అదియే ఒక సొరగము॥

పొద్దుటాల నుండి నేను పడవేసి పడవేసి
అలసి పోయి ఉన్నాను లంగరెత్త లేను
సొరచేపల ఆటలు చూసి చూసి పట్టాను
వాటి రూపు నీ కనుల సాటి రాదు చినదాన॥

కొంగు బిగియిస్తాను తెడ్లను నే వేస్తాను
వెన్నెలలో నేను తానమాడుకుంటూ
పడవ నడుపుతాను పల్లెపాట లెన్నెన్నో
పాడుకుంటూ నీ తోడ ఆడుకుంటాను॥

నీ బిగికౌగిలి కన్నా ఇంక సొరగ మెక్కడుంది
నీమోవి తేనె కన్న తీయని దేముంది
మన మొక్కటై పోతే చాలదా ఆహోయి
మళ్ళీ ఈ కెరటాల కుదుపు లెందుకే॥

ఎవ్వరూ చూడకుండ పడవలోన ఇటూ అటూ
ఊగుకుంటు ముచ్చటైన నడి సంద్రములోన
నీ ఎదను నా ఎదకూ హత్తుకుంటే
ఆ సుఖములోని మజా ఎంతో బాగుంటుంది॥

చాలు చాలు నీ కోరిక చందురు కిరణాలకు
ఆటు పోటుతో సంద్రం దద్దరిల్లి పోతున్నది
అదిగో ఆ మబ్బులు కమ్ముక వస్తున్నాయి
మన పడవను ఎనకకు మరలించుట మంచిది॥

ఆ ఒడ్డే ఇప్పుడు దగ్గరలో ఉంది
అంత భయముగా ఉంటే నన్ను కట్టుకో
నా కౌగిలిలోని రుచి నీకు చూపుకుంటు
పడవను వడి వడిగా నేదరికి నడుపుతాను॥

## 69

గొబ్బియలో గొబ్బియలో
గోధూళి వేళలో గొబ్బియలో॥

మా యింటి వాకిట గొబ్బియలో
మా కన్నుల పంట గొబ్బియలో॥

గుమ్మడి పూవులు గొబ్బియలో
కుందనపు బొమ్మలు గొబ్బియలో
ముక్కోటి దేవతలు గొబ్బియలో
మురిసి చూచేరు గొబ్బియలో॥

సంక్రాంతి సంబరాన గొబ్బియలో
చక్కగా పెట్టాము గొబ్బియలో
పరవశించి సూర్యుడు గొబ్బియలో
కిరణాల తాకాడు గొబ్బియలో॥

మా అక్క మా బావ గొబ్బియలో
మా యింటి కొచ్చారు గొబ్బియలో
మా నాన్న మాకూ గొబ్బియలో
క్రొత్త బట్టలెచ్చారు గొబ్బియలో॥

చామంతి విచ్చింది గొబ్బియలో
ముద్దబంతి పూచింది గొబ్బియలో
మా అమ్మగారూ గొబ్బియలో
మంచి వంటలు వండారు గొబ్బియలో॥

శ్రీ గౌరిదేవీ గొబ్బియలో
మా పూజలందీ గొబ్బియలో
మాపైన దయా జూపి గొబ్బియలో
మంచి మొగుణ్ణి మాకిచ్చు గొబ్బియలో॥

70

సిరు లొసగే తల్లికే
క్షీరాబ్ధి కన్యకకు
మంగళం మంగళం
శ్రిత మంగళం॥

రాగతాళ జ్ఞానాన్ని
బాగుగా యిచ్చేటి
రమణి గీర్వాణికి
యిదె మంగళం॥

శక్తి నొసగి లోకాల
చక్కగా చూచేటి
మంగళ గౌరికీ
మహిత మంగళం॥